PARLE

POPPINS®

Doon Kya?

# Ram and Shyam

## క్లోన్స్

డా. మీన్ ఈ లాబ్‌లో ఉన్నారు...







క్లోన్స్ తమ క్రిమినల్ చర్యలతో తీవ్రంగా విజృంభించారు.



రామ్ , శ్యామ్ మరియు ఏంజిల్ రోడ్డుపై నడుస్తున్నారు.




ముగ్గురు క్లోన్స్ చర్యలని గమనించారు.




ఏంజిల్ క్లోన్స్ వద్దకు పరిగెత్తింది మరియు తన ప్రత్యేక హిప్నొటైజింగ్ శక్తితో వారిని హిప్నొటైజ్ చేసింది.




క్లోన్స్ హిప్నొటైజ్ అయ్యారు మరియు వారు డా. మీన్ లాబ్‌ని నాశనం చేసారు.




డా. మీన్ చివరికి తన **ఈవిల్-ఎక్స్2** ఆవిష్కారాన్ని నాశనం చేసాడు.




నా పనిని మళ్ళీ ఆ తుంటరి పిల్లలు నాశనం చేసారు. మరో సారి వాళ్ళ పని పడతాను.






# యువ విజేతలు

## గౌరాంగ్ ఆంబ్రే

థానెకు చెందిన గౌరాంగ్ ఆంబ్రే, లాంగ్ జంపర్ మరియు వందమీటర్ల పరుగుపందెం నిపుణుడు.

ఇతడు మూడవ తరగతిలో ఉన్నప్పుడే మైదానంలోకి వచ్చాడు. క్రీడల్లో అనేక రికార్డులను బద్దలుగొట్టాడు.

80 మీటర్ల పరుగుపోటీలో 10.9 సెకనుల వ్యవధిలో గెలిచి రికార్డు సాధించాడు. అండర్ 14 విభాగంలో 5.41 మీటర్లు దుమకడం ద్వారా, 1989లో నెలకొల్పబడిన వైఎమ్‌సిఎ మీట్ రికార్డును బద్దలుగొట్టాడు.

ప్రస్తుతం జాతీయ స్థాయి పోటీల్లో తన సత్తా చూపాలని అనుకుంటున్నట్లు గౌరంగ్ తెలిపాడు. ప్రపంచ పరుగు వీరుడు ఉస్సేన్ బోల్ట్ ఇతడికి ఆదర్శం.

ఇంటినుంచి, పాఠశాలనుంచి చక్కగా మద్దతు పొందిన గౌరంగ్ థానేలోని దాదాదోజి కొండో స్టేడియంలోని సెవెన్ స్టార్ స్పోర్ట్స్ అకాడమీలో ప్రతిరోజూ 5.30 నుంచి 7.30 వరకు పరుగెడుతుంటాడు. తన కోచ్ చంద్రకాంత్ సోంకర్, తండ్రి రాజేంద్ర అంబ్రే పర్యవేక్షణలో ప్రాక్టీసు చేస్తూండే గౌరాంగ్ చూపరుల దృష్టిలో ఏకాగ్రతకు మారుపేరులా కనిపిస్తాడు.



ఈనెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు.

**విజయాలు:**

- రజత పతకం - అథ్లెటిక్స్ మీట్, కరాద్
- రజత పతకం - వెస్ట్ జోన్ మీట్, భోపాల్

మీ కుటుంబంలో గాని, పొరుగున ఉన్న కుటుంబాలలో కాని ఎవరినయినా ఉదయతారగా ప్రతిపాదించాలని మీరు భావిస్తున్నారా? దయచేసి బాలబాలికల వివరాలు మరియు మీ ప్రతిపాదనలను మాకు పంపించండి:

Young Achievers-RCM,
Chandamama India Ltd,
No:2 Swati Enclave,
Door No 5 & 6,
Amman koil st,
vadapalani,
chennai -26
(or)
online@chandamama.com

# ఈ సంచికలో ...



చందమామ సంపుటి: 64 ఏప్రిల్ 2011 సంచిక: 04

















**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

ప్రియ మిత్రులారా!

సంవత్సరంలో మీరంతా ఎదురుచూస్తున్న సమయం రాబోతోంది. మిమ్మల్ని తీవ్ర శ్రమకు గురిచేసిన పరీక్షలు ఏప్రిల్ ప్రథమార్థంలో ముగియనున్నాయి. పరీక్షలు ముగియగానే వేసవి సెలవులు ప్రారంభమవుతాయి. సెలవులను ఆస్వాదించడానికి మీలో ప్రతి ఒక్కరికీ మీమీ ప్రత్యేక పథకాలు ఉన్నాయని మాకు తెలుసు.

మీరు ఆడుకునేందుకు, పర్యటించేందుకు, కొత్త విషయాలను నేర్చుకునేందుకు, జ్ఞానాన్ని పెంచుకునేందుకు వేసవి సెలవులు మీకు ఎంతో సమయాన్ని కల్పిస్తాయి. మీ సెలవుల్ని ఎలా గడిపారు, ఏఏ ప్రాంతాలు పర్యటించారు వంటి వివరాలు తెలుపుతూ ఇమెయిళ్లు/ఉత్తరాలతోపాటు ఫోటోలు కూడా మాకు పంపగలరని ఆశిస్తున్నాము.

ఈ నెలలో రామనవమి రోజున శ్రీరామజయంతిని, తర్వాత హనుమాన్ జయంతిని జరుపుకుంటున్నాము. అలాగే ఈ నెలలోనే వచ్చే గుడ్ ఫ్రైడే, ఈస్టర్ సండేలు మన క్రైస్తవ మిత్రులకు ముఖ్యమైన పండుగలు. ఏప్రిల్ 4న తెలుగు నూతన సంవత్సరాది, 13న బైశాఖి, 14న విషు పర్వదినాలు జ్యోతిశ్శాస్త్రపరంగా నూతన సంవత్సర ప్రారంభాన్ని సూచిస్తాయి, దేశవ్యాప్తంగా ప్రజలు ఉగాదిని తమ తమ పద్ధతుల్లో జరుపుకుంటారు.

ఏప్రిల్ 7న ప్రపంచ ఆరోగ్యదినం. వ్యాధుల నేపథ్యంలో ఆరోగ్యాన్ని కాపాడుకుని, వాటి నిరోధానికి చర్యల గురించి ఆలోచించడానికి ఈ దినాన్ని మనం గుర్తుంచుకోవాలి.

మధ్యప్రాచ్యంలోని అనేక దేశాల్లో ప్రజా తిరుగుబాట్లు చెలరేగడం తెలిసిందే. ఈ దేశాల ప్రజలు ప్రజాస్వామిక పాలన కోసం ఉద్యమిస్తున్నారు. ప్రజాస్వామ్యం ప్రజలకు స్వేచ్ఛ, న్యాయం, ప్రగతి, సమాన అవకాశాలను కల్పిస్తుంది. భారతదేశం ప్రజాస్వామిక దేశం కాబట్టి ప్రజాస్వామిక రాజ్య సూత్రాలు, విలువలను మనందరం ఎత్తిపట్టాలి.

ఈ ఏడు కొత్త పుస్తకాల ప్రచురణ, మొబైల్, ఇంటర్నెట్‌లో కొత్త కార్యక్రమాలను ప్రారంభించనున్నాము. మీరు మొబైల్‌లో, ఇంటర్నెట్‌లో వేటిని చదివి, చూడాలనుంటున్నారో మాకు తెలుపండి. మీరు సూచించిన వాటిని మా పథకంలో జోడించగలము.

– సంపాదకులు




ఏప్రిల్ 2011 ₹20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

# పాఠకుల లేఖలు

మార్చి నెల చందమామలో అన్ని కవర్ పేజీ చిత్రాలూ అద్భుతంగా ఉన్నాయి. చందమామ 'ఆర్ట్‌బుక్' వర్ణచిత్రం పత్రికను మెరిపించింది. ఈ బొమ్మను ఫ్రేమ్ కట్టించుకుంటున్నాను. ఆర్ట్‌బుక్‌కోసం ఈరోజే ఎం.ఒ కూడా పంపిస్తున్నాను. కథలు ఎక్కువగా ప్రచురిస్తున్నందుకు సంతోషం.

– ఎస్. శివనాగేశ్వరరావు, తెనాలి

ఫిబ్రవరి సంచిక గెటప్ సైజ్, చిన్ని, పెద్ద కథలు, ప్రచురణలో మార్పులుతెచ్చి పూర్వవైభవాన్ని చాటేలా తీర్చిదిద్దారు. 25 పైసల ధరతో మొదలెట్టి రూ. 20ల వరకు వెలపెట్టి పత్రికను చదువుతున్న మాబోటి వృద్ధులకు చందమామను చూస్తే ఇంద్రధనస్సును తలపింప జేసే అందాల చంద్రుడు ముంగిట వాలినట్లు చల్లటి ఆనందం అనుభవిస్తున్నాము. – బొడ్డపాటి రాజేశ్వరమూర్తి, చిలకలపూడి

ఫిబ్రవరి చందమామ చూస్తుంటే తృప్తిగా ఉంది.చేతిలో పట్టుకుంటే బరువుగా ఉంది. అన్ని ఫీచర్లూ, మంచిగా అమరాయి. నాకైతే ఈ పేపరే ఇష్టం.ఆ వాసన కూడా ఇష్టం. బొమ్మల్లో ఆధునికత ఉంటే తప్పు లేదు కానీ, కాస్త షార్ప్‌గా ఉంటే బావుంటుంది. – గోదావరి లలిత, అమెరికా

ఫిబ్రవరి చందమామ కవర్ పేజీ చాలాబాగుంది. కాని ముఖచిత్రాలను ఎవరు గీశారు, నేపథ్యం వంటి వివరాలు పత్రికలో ఎక్కడా లేవు. అన్ని కథలూ పాతవే కదా.. 25 సంవత్సరాల కథ అని ప్రత్యేకంగా రాయడమెందుకు?

– వి.వి.వి రమణ, హైదరాబాద్

ఫిబ్రవరి సంచికలోని అన్ని కథలూ ఆకట్టుకున్నాయి. శ్రీనివాసకల్యాణం సీరియల్ ప్రత్యేకించి ఆసక్తికరంగా కొనసాగుతోంది. చిట్టి కథలు నీతిదాయకంగా ఉంటున్నాయి.

– బిక్కునూరి రాజేశ్వర్, పాన్కల్

చందమామలో ప్రస్తుతం సగం పాత కథలు, సగం కొత్త కథలు వస్తున్నాయి. 25 ఏళ్ల కథ అనే శీర్షికను తీసివేస్తున్నాము. కథ మాత్రం ఉంటుంది. – సంపాదకులు

# తాయెత్తు

శివయ్యకు దేశ సంచారమంటే భలే సరదా. అప్పులు చేసి దేశంలోని పుణ్య తీర్థాలు పుణ్యక్షేత్రాలు సందర్శించాడు. అప్పులు తీర్చకుండా దాటవేస్తే వడ్డీలు పెరిగి ప్రాణాలకే ముప్పు తెస్తాయని భయపడ్డాడు. దేశ సంచారం వల్ల లౌకికం బాగానే అబ్బడంతో కొత్త అప్పులు చేసి డాబుసరిగా కుటుంబాన్ని నడపసాగాడు. ప్రజల్లో ''వింధ్య పర్వత ప్రాంతంలోని ఒక యోగి కొన్ని తాయెత్తులు ప్రసాదించాడు. ఒక తాయెత్తుకు పూజ చేసి ధరించాను. ఫలితంగా నా అప్పులన్నీ పటాపంచలయ్యాయి.'' అని అతడు వ్యాప్తి చేశాడు. శివయ్య మాటలు అప్పుల్లో మునిగున్న వాళ్ళను భ్రమలో ముంచాయి. రుణ బాధితులు శివయ్యను కలిసి తాయెత్తుల కోసం ఎగబడ్డారు. శివయ్య వాళ్ళ చేత పూజలు చేయించి దండిగా డబ్బులు దండుకోసాగాడు. దీంతో చుట్టు పక్కల ఊళ్ళ నుంచి కూడా జనం వచ్చి శివయ్య కాళ్ళ మీద పడ్డారు.

ఒక రోజు చిన్ననాటి మిత్రుడు శివయ్య వద్దకు వచ్చి 'నీ గురించి విన్నాను. ప్రస్తుతం పీకల్లోతు అప్పుల్లో మునిగున్నాను. నాకొక తాయెత్తిచ్చి పుణ్యం కట్టుకో,'' అని శివయ్య రెండు చేతులూ పట్టుకొని ప్రాధేయపడ్డాడు.

మిత్రుడికి ఏం చెప్పాలో అర్థం కాని శివయ్య, కాస్సేపటికి తేరుకొని ఒక తాయెత్తు తీసి ఉచితంగా తీసుకోమన్నాడు. కాని మిత్రుడందుకు అంగీకరించక డబ్బిచ్చి వెళ్ళాడు. ఆ డబ్బు ఖర్చు పెట్టకుండా శివయ్య భద్రంగా ఉంచాడు. కొన్నాళ్ళ తరువాత ఆ మిత్రుడు శివయ్య వద్దకు వచ్చి, ''అప్పులు తీరలేదు. ఎంత డబ్బయినా ఫర్వాలేదు. మంచి తాయెత్తియ్యి!'' అడిగాడు.

అప్పుడు శివయ్య భద్రంగా దాచిన డబ్బు తెచ్చి మిత్రునికిస్తూ, ''తాయెత్తులకు అప్పులు తీరుతున్నాయో లేదో కాని నా అప్పులు మాత్రం తీరిపోతున్నాయి. నా సంపాదనా మార్గం ఇది. నువ్వెలా గ్రహిస్తే అలా గ్రహించు. నీ డబ్బు తిరిగి తీసుకో!'' అన్నాడు. నిర్ఘాంతపోయిన మిత్రుడు మారు మాట్లాడక ఇంటికి తిరుగు ముఖం పట్టాడు. – బెలగాం భీమేశ్వరరావు



**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: ................................ Sex :......................................

Address: ..........................................................................................

..........................................................................................

..........................................................................................

.................................................... City: ..........................................

State:........................................ Pin:..............................................

Telephone:..........................................................................................

Mobile:..........................................................................................

Email:..........................................................................................

Subscription Number (for renewals):..........................................

Gift Subscription to the following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees..............................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on.........................................

..........................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# తొందరపాటు

చెర్లపల్లి గ్రామ వాసులు వెంకటయ్య, ధర్మయ్య ఇద్దరూ పెద్దమనుషులు. గ్రామంలో ఏ పంచాయితీ అయినా ఇద్దరూ కలిసి పరిష్కరించేవారు. ఒకసారి ధర్మయ్య వెంకటయ్య దగ్గర 10 వేల రూపాయలు అప్పు తీసుకున్నాడు. ధర్మయ్య తన బాకీని అడగకుండానే చెల్లిస్తాడని వెంకటయ్య అనుకున్నాడు. కాని ఆరునెలలు గడిచిపోయాయి. ధర్మయ్య ఆ విషయమై ఏమీ మాట్లాడటం లేదు. చివరకు వెంకటయ్యకు ఓపిక నశించింది.

ఒకరోజు గ్రామకూడలిలో గ్రామస్తులతో వెంకటయ్య ఈ విషయం చెప్పి ''పేరుకు మాత్రమే ధర్మయ్య. అన్నీ అధర్మపు బుద్ధులే. నా దగ్గిర తీసుకున్న పదివేలు ఇంతవరకూ చెల్లించనే లేదు. నేను అడగందే ఇవ్వడా ఏమిటీ?'' అని దూషించడం ప్రారంభించాడు.

అప్పుడే అక్కడకు వచ్చిన ధర్మయ్య ఈ మాటలు విని నొచ్చుకుని ''ఏం వెంకటయ్యా, నీ బాకీ నేను ఎప్పుడో చెల్లించాను గదా,'' అన్నాడు. ''నా బాకీ చెల్లించావా? ఈ అబద్ధాలు ఎప్పటినుండి మొదలెట్టావు? నమ్మి అప్పు ఇస్తే ఇలా ఎగవేస్తావా!'' అన్నాడు వెంకటయ్య. దానికి ధర్మయ్య ''చూడు వెంకటయ్యా! నీ వద్ద అప్పు తీసుకున్న మరునాడే నేను నీ భార్యకు ఆ డబ్బు చెల్లించాను, కావాలంటే విచారించుకో'' అని అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన వెంకటయ్య భార్య ''అవునండీ నేను మీకు చెప్పలేదు. ఆ పదివేలు ఆయన మీ దగ్గర తీసుకున్న మరునాడే నాకు చెల్లించారు. నేను దాన్ని దాచిపెట్టాను కాని నా తమ్ముడు అనుకోని ఇబ్బందుల పాలై ఆ సమయానికే ఇంటికి వచ్చాడు. తన బాధ చూసి తట్టుకోలేక ఆ పదివేలను తమ్ముడికి ఇచ్చి పంపాను. మీకు వెంటనే చెబితే తిడతారని భయపడి చెప్పలేదు. పాపం ఆయన తప్పు ఏమీ లేదు,'' అని అన్నది. తొందర పడి నోరు పారేసుకున్నందుకు వెంకటయ్య ఎంతో నొచ్చుకుని ధర్మయ్యను క్షమాపణ అడిగాడు.

– ఎస్. రామకృష్ణయ్య



# చందమామతో నా జ్ఞాపకాలు

కుందపూర్ గ్రంథాలయాన్ని ఈ మధ్యే నేను సందర్శించాను. అక్కడ చందమామ పత్రికను చూడగానే ఒక్కసారిగా పాత జ్ఞాపకాలు నన్ను వెంటాడాయి. చందమామ పుటలు తిరగేస్తుంటే నా బాల్యపు మధుర క్షణాలు సముద్ర తరంగాల్లా నా మనస్సులో చెలరేగాయి. నేను 3వ తరగతి చదువుతున్నప్పుడు, తొలిసారిగా నా ప్రియనేస్తం చందమామను కలుసుకున్నాను. మాది కర్నాటక రాయచూర్ జిల్లాలోని చిన్న గ్రామం. ఊరిపేరు జలహళ్లి. ఒకసారి ఊర్లో జాతర సందర్భంగా మా అత్త 'చందమామ' కాగితాలలో జిలేబీ, బజ్జీ మడిచి పెట్టి తినడానికి ఇచ్చింది. జిలేబీని తిన్నాక, మడిచిన కాగితాలను తిరగేసి చూశాను. ఒక్కసారిగా ఆశ్చర్యమేసింది.



Name: Suresh Jalahally
Occupation: English Lecturer, Udupi.

తొలిసారిగా చదివిన వెంటనే ఆ కాగితాలు ఒక్కసారిగా నన్ను ఆకర్షించాయి. నేను వెంటనే మా అత్తావాళ్లింటికి పరుగెత్తి, తన వద్ద ఉన్న అన్ని పాత చందమామల్నీ ఆబగా తీసుకున్నాను. వాటిని ఇంటికి తీసుకెళ్లి, నేలమీద అన్ని సంచికలనూ పరిచి తర్వాత ఒకదాని వెనుక ఒకటిగా కథలను చదవటం మొదలెట్టాను. అవి చందమామ నా జీవితాన్ని అమితానందంలో ముంచెత్తిన క్షణాలు. నేను ఎన్నటికీ మర్చిపోలేని క్షణాలు.

అప్పటినుంచి నా స్కూలు పుస్తకాల కంటే ఎక్కువగా చందమామలపై నేను మక్కువ పెంచుకున్నాను. ఆనంద సంభ్రమాశ్చర్యాలు... చందమామలో నేను చదివిన ప్రతి కథ నాలో కలిగిస్తూవచ్చిన మధురానుభూతులు ఇవే. ఇన్నేళ్ల తర్వాత కూడా అప్పటి రోజులను తల్చుకుంటున్నప్పుడు నా మనస్సు ఆనందంతో నిండిపోతుంది. ఇప్పుడు సైతం చందమామను చదివినప్పుడల్లా, నేను చిన్న పిల్లాడినయిపోతుంటాను. నా బాల్యాన్ని రంగులమయం చేసి ఆనందంలో ముంచెత్తిన చందమామ పత్రికకు నేను ఎప్పటికీ రుణపడి ఉంటాను. చందమామకు నాకు ఉన్నది ఆత్మానుబంధం. ఆత్మీయానుబంధం. ఎందుకంటే చందమామ కథలు చదువుతూ పెరిగాన్నేను.

చందమామ కథలు మా అమ్మ చేసే మధురాతిమధురమైన వంటకాలంత రుచిగా ఉంటాయి. నా బాల్యం పొడవునా చందమామ పుస్తకాలు మధుర జ్ఞాపకాలను నింపుతూ వచ్చాయి. నా హృదయంలో చందమామదే ప్రత్యేక స్థానం. ఈనాటికీ నేను చందమామను క్రమం తప్పకుండా చదవడమే కాకుండా ప్రతి సంచికనూ భద్రంగా పదిలపరుస్తూ వస్తున్నాను. ఎందుకంటే నా చిన్నతనంలో నేను పొందిన ఆనంద క్షణాలను, నేర్చుకున్న నైతిక విలువలను నా పిల్లలు కూడా పొందాలని నా ఆకాంక్ష.

## బేతాళ కథలు

# వరనిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా స్మశానంకేసి నడువసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, 'రాజా, ఈ భయానక వాతావరణంలో, సాహసంగా ముందుకు సాగిపోవాలన్నదే నీ నిర్ణయంలా కనబడుతున్నది. కాని ఈ లోకంలో ఎంతో కొంత స్వార్థముండకుండా, ఏ నిర్ణయమూ ఉండదు. ముఖ్యంగా కుమార్తెల కోసం వరాన్వేషణ చేసే వారి తల్లిదండ్రులు వరుల పూర్వాపరాలూ, వారి ప్రత్యేకతలూ, పూర్తిగా పరిశీలించాకనే నిర్ణయాలు తీసుకుంటారు. అయితే ప్రతాపుడనే రాజు తన ఏకైక కుమార్తెకు వరుణ్ణి నిర్ణయించేటప్పుడు ఇందుకు భిన్నంగా వ్యవహరించాడు. ఆ కథ చెబుతాను శ్రమ లేకుండా విను,' అని ఇలా చెప్పసాగాడు.

పూర్వం కుంతలదేశాన్ని ప్రతాపుడనే రాజు పరిపాలించేవాడు. అతనికి పుత్రసంతానం లేదు. తన ఏకైక పుత్రిక కాంతిమతికి తగిన వరుణ్ణి చూసి వివాహం చేసి, అల్లుడికి రాజ్యభారం అప్పజెప్పి వాన ప్రస్థానికి వెళ్లా



లన్న ఉద్దేశ్యంతో ఉన్నాడు. ఒకరోజు కాంతిమతి చెలికత్తెలతోకూడి రాజధానికి వెలుపల ఉన్న కులదేవత ఆలయానికి పూజలు చేయడానికి వెళ్ళింది.

ఆ సమయంలో దగ్గరలో ఉన్న అడివిలోంచి పెద్ద పులొకటి హఠాత్తుగా గుడిలో చొరబడింది. పులిని చూడగానే చెలికత్తెలు చెల్లాచెదురై పరుగులు తీస్తుంటే, కాంతిమతి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. పులి భీకరంగా గాండ్రిస్తూ ఆమెపై దుముకపోతుంటే, అక్కడే గుడిమండపంలో కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్న యువకుడొకడు చటుక్కున తన కత్తితీసుకుని ఆ పులితో ఒంటరిగా పోరాడి చంపేశాడు. జరిగినదంతా విన్న మహారాజు ఆ యువకుణ్ణి సాదరంగా పిలిపించి, 'నా కుమార్తె ప్రాణాలు కాపాడినందుకు నీకెంతగానో రుణపడి ఉన్నాను. ఇంతకీ నువ్వాసమయంలో అక్కడెలా ఉన్నావు,' అని అడిగాడు.

ఆ యువకుడు 'మహారాజా! నాది మరాళ దేశం. పేరు సౌమిత్రుడు. నా తండ్రి మకరంద మహారాజుని నా పినతండ్రి కుట్ర చేసి పదవీచ్యుతుణ్ణి చేశాడు. సింహాసనాన్ని ఆక్రమించి తల్లిదండ్రులిద్దరినీ చెరసాలలో బంధించాడు. నేనెలాగో తప్పించుకున్నాను. దేశాలు తిరుగుతూ మీ రాజ్యానికి చేరుకున్నాను,' అన్నాడు. సౌమిత్రుడు రాజకుమారుడని, తన బాల్యమిత్రుడైన మకరందుడి పుత్రుడనీ రాజుకి అర్థమై సంతోషించాడు. అతడు మనస్సులో, ఈ సౌమిత్రుడు రాజవంశంలో పుట్టిన వాడు. రాజ్యం లేకపోతేనేం కాంతిమతినిచ్చి పెళ్ళి చేస్తే రాజు కాడా? నా సహాయంతో కోల్పోయిన తన రాజ్యాన్ని కూడా చేజిక్కించుకోలేడా? అప్పుడతడు రెండు రాజ్యాలకు అధిపతి కాడా? అనుకుంటూ సౌమిత్రుడితో, 'నీ తండ్రి మకరందుడు నా ప్రియమిత్రుడు. బాల్యంలో ఆయనా నేనూ కలిసి విద్యాభ్యాసం చేసాం. ఆయన కొచ్చిన కష్టం నువ్వు చెప్పాకనే నాకు తెలిసింది. నా సైన్యాన్నిచ్చి నీకు తోడు పంపుతాను. శత్రువుల్ని జయించి రాజ్యాన్ని తిరిగి హస్తగతం చేసుకో. ఈ విధంగానైనా నా కుమార్తెను రక్షించినందుకు నీ రుణం తీర్చుకోగలను,' అన్నాడు.

అందుకు సౌమిత్రుడు, 'మహారాజా! నారాజ్యం శత్రువులపాలయినా నేనేనాడూ ఆత్మస్థైర్యం కోల్పోలేదు. దేశాటనం చేస్తూ క్షాత్రవిద్యలన్నీ క్షుణ్ణంగా నేర్చుకున్నాను. నా శౌర్య పరాక్రమాలతోనే పోయినదంతా తిరిగి పొందగలనన్న నమ్మకం నాకున్నది. రాజకుమారిని రక్షించటం యాదృచ్ఛికం. కేవలం క్షత్రియ ధర్మాన్ని నిర్వర్తించటం కాక మరొకటి కాదు.

మీరింతవరకు చేసిన సత్కారాలు చాలు.' అంటూ రాజువద్ద సెలవు తీసుకుని వెళ్లిపో యాడు.

సౌమిత్రుడి మాటలు విని అక్కడే ఉన్న మంత్రి మాధవవర్మ 'ప్రభూ, ఇతడి ఆత్మస్థ యిర్యం ముచ్చట గొలపడం లేదా?' అన్నాడు. అందుకు రాజు, 'ఇతని శౌర్యాన్ని ఇదివరకే చూశాం. కాని ఇతనికి ఆత్మస్థయిర్యం మాత్రం అధికంగా ఉన్నదనిపిస్తున్నది,' అన్నాడు.

రాజుమాటల్లోని అంతర్యమేమిటని మంత్రి ఆలోచనలో పడగా, చారుడొకడు ప్రవేశించి, 'ప్రభూ మన ఉత్తర సరిహద్దులో ఉన్న పర్వతాల వెనకనుంచి రాజ్యంలోకి జొర బడుతూ ఆటవికజాతులు కల్లోలం సృష్టి స్తున్నాయి. అక్కడి మండలాధిపతి వారి ప్రచ్ఛన్న దాడుల్ని తిప్పికొట్టలేకపోతున్నాడు. ఈ సమాచారం ఇవ్వటానికి వచ్చాను,' అని చెప్పి వెళ్లాడు.

ఇది విని మంత్రి రాజుతో మెల్లగా, 'ఒక పర్యాయం తమరు నాతో మహారాణికి తన మేనల్లుడు ముకుందవర్మని అల్లుణ్ణి చేసు కోవాలని ఉన్నదని, ఆమె ఒత్తిడి మేరకే అతణ్ణి సైన్యాధిపతిని చేయవలసి వచ్చినదనీ అన్నట్లు గుర్తు. మనం ముకుందుణ్ణి సరి హద్దుల్లో సమస్యని పరిష్కరించుకు రమ్మని పంపిస్తే అతని శక్తిసామర్థ్యాలకు పరీక్ష పెట్టి నట్టు అవుతుంది కదా,' అన్నాడు. రాజు, 'కాంతి మతికి ముకుందుడి పట్ల సదభిప్రాయం ఉన్నట్టు కనబడదు. అయినా మీరన్నట్లు అతడికీ పని అప్పగించడం వల్ల వచ్చే నష్ట మేమీ లేదు. అలాగునే కానిద్దాం,' అన్నాడు. ముకుందుడు పర్వత ప్రాంతాలకు వెళ్లి తన లౌక్యంతో ఆటవికుల మధ్య వారిలో వారికి చిచ్చుపెట్టి, కొందరిని మచ్చిక చేసుకుని, ఎదిరించిన వారిని క్రూరంగా అణిచివేశాడు. పరిస్థితి చక్కదిద్ది తిరిగి వచ్చాడు. ప్రతా





ద్రోహానికి పాల్పడుతున్న ఇతణ్ణి మన మణి హార మండలాధీశుడి ఆజ్ఞానుసారం పట్టి తెచ్చాం,' అంటూ మండలాధీశుడి లేఖను అతడికి ఇచ్చారు. ఉత్తరాన్ని చదివి రాజు ఆగ్రహంతో, 'తిరుగుబాటు చేసినవారికి మరణదండనే శిక్షని తెలియదా?' అన్నాడు.

మానవేంద్రుడు వినయంగా, 'రాజ ద్రోహానికి దిగజారే చరిత్ర మా వంశానికే లేదు. మాపూర్వీకులంతా మీ కుటుంబసేవలో తరించినవాళ్ళే. నా తండ్రి గంభీరుడు విదేహ రాజుతో యుద్ధం జరిగిన సమయంలో మీకు రక్షణగా నిలబడి హతుడయ్యాడు.' అన్నాడు.

గంభీరుడి పేరు వినగానే రాజు చెమర్చిన కళ్ళు తుడుచుకుంటూ, 'అటువంటి రాజ భక్తుడి కడుపున పుట్టి తిరుగుబాటుకి దిగడం సిగ్గుగా లేదా?' అన్నాడు.

అందుకు మానవేంద్రుడు, 'ప్రభూ నేను చేసింది తిరుగుబాటు కాదు. మీ పేరిట జరుగుతున్న అన్యాయాలను ఎదిరిస్తూ, ఒంటరిగా పోరాటం చేస్తున్న నన్ను పట్టి బాధించాలని మండలాధిపతి విశ్వప్రయత్నం చేశాడు. ప్రజలంతా నా పక్షాన ఉంటున్నం దున చాలా రోజులు అతడికది సాధ్యం కాలేదు. చివరికి కుతంత్రంతో నన్ను బందీ చేసి మీ వద్దకు పంపాడు' అన్నాడు.

ప్రతాపుడు అతడితో, 'నువ్వు చెప్పేదంతా నమ్మాలని ఎక్కడున్నది. ఈ క్షణంలో నిన్ను ఉరితీయిస్తే ఏమవుతుంది?' అన్నాడు.

మానవేంద్రుడు నిర్భయంగా, 'నేను ప్రజలమధ్య నుంచి వచ్చినవాడిని, వారి కోసం పోరాడుతున్నవాడిని. భూమి మీద దేవుడ నబడే రాజు తీసుకున్న ఏ నిర్ణయమైనా శిరసావహిస్తాను,' అన్నాడు.

పుడు ముకుందుణ్ణి ఎంతగానో అభినందిం చాడు.

ఒకరోజు ప్రతాపుడు ఏకాంతంగా ఉన్న ప్పుడు మంత్రి మాధవవర్మ అతడితో, 'ప్రభూ, మన ముకుందుడు తన సత్తా ఏమిటో చాటి చూపాడు. ఇతడు మన కళ్ళముందుండగా, రాజకుమారికి మరో వరుణ్ణి వెదకటం అవ సరమా?' అన్నాడు. అందుకు రాజు, 'ముకుం దుడు వ్యక్తిగతంగా ప్రతిభావంతుడే. పరి సరాలూ-పరిస్థితులూ ఇట్టే అవగాహన చేసు కోగలడు. కాని ఇతనికి తంత్రమూ, కుతం త్రమూ రెండూ తెలుసు. ఇది గమనించతగ్గ విషయం,' అన్నాడు. మంత్రికి రాజు అభి ప్రాయం అర్థం కాలేదు.

కొన్నాళ్ళు గడిచాక, ఒకరోజు ప్రతాపుడు కొలువుతీరి ఉండగా రాజభటులు బందీగా తెచ్చిన మానవేంద్రుడనే యువకుణ్ణి అతని ముందు ప్రవేశపెడుతూ, 'ప్రభూ, రాజ

రాజు మంత్రితో, 'ముందితణ్ణి బంధ విముక్తుణ్ణి చేయండి. మీరే స్వయంగా మణిహార మండలానికివెళ్లి విచారించి ఇతడు చెప్పినవన్నీ నిజాలయితే ఆ మండలాధీశుణ్ణి దండించి అతని స్థానంలో ఇతణ్ణి నియమించండి,' అన్నాడు. మణిహార మండలం నుంచి మంత్రి తిరిగివచ్చి, 'మానవేంద్రుడన్నట్లుగానే అక్కడి పరిపాలన ప్రజలకు కంటకప్రాయంగా ఉన్నది. మీ ఆదేశాను సారం ఆ మండలాధిపతిని తొలగించి మానవేంద్రుడికా పదవి ఇచ్చి వచ్చాను,' అన్నాడు.

ఆ తరవాత ఒక రోజు రాజు మంత్రిని పిలిచి 'కాంతిమతికి కల్యాణ ఘడియలు వచ్చాయి. మణిహార మండలాధిపతి మానవేంద్రుడితో ఆమె వివాహం జరుగుతుంది. ఏర్పాట్లు చేయించండి' అన్నాడు. 'మీ నిర్ణయం ఇలాగే ఉంటుందని నేను ముందే ఊహించాను,' అంటూ మంత్రి రాజుని అభినందించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, 'రాజా! తన కుమార్తెకు వరుడై రాజ్యానికి ఉత్తరాధికారి కావల్సినవాడిని ఎంచుకునేటప్పుడు రాజు ప్రతాపుడు తనకు తారసపడిన ముగ్గురు యువకుల్లో రాజరక్తం, అందం, ధైర్యసాహసాలూ, అంతకుమించి అంతులేని ఆత్మస్థైర్యం ఉన్న సౌమిత్రుణ్ణి పక్కన పెట్టాడు. రాజకుటుంబీకుడూ, అప్పటికే సైన్యాధిపతిగా ఉన్నవాడూ, రాజ్యంలో ఆటవికుల సమస్యను సమర్థతతో పరిష్కరించినవాడూ అయిన ముకుందవర్మని కాదన్నాడు. రాజ్యంపై తిరుగుబాటు చేసి రాజదండన ఎదుర్కొంటున్న మానవేంద్రుణ్ణి మండలాధిపతిని చేసి ఆపైన అల్లుణ్ణి చేసుకు



న్నాడు. మానవేంద్రుడిలో ఉన్న ప్రత్యేక గుణమేమిటి? ప్రతాపుని నిర్ణయంలో స్వార్థ మున్నదా? లేక మరేదైనా పరమార్థమున్నదా? నీకు తెలిసికూడా చెప్పక పోయావో నీ తల వేయి ముక్కలవుతుంది,' అన్నాడు.

విక్రమార్కుడు సమాధానంగా:

సౌమిత్రుడు అందగాడనీ, సాహసియనీ, రాజ్యం కోల్పోయిన రాజవంశీకుడనీ తెలుసుకున్న ప్రతాపుడు కోల్పోయిన అతడి రాజ్యం తిరిగి సంపాదించుకునేలాగ సాయపడి అల్లుణ్ణి చేసుకోవాలనుకున్నాడు. సౌమిత్రుడు మాత్రం తన లక్ష్యసాధనకి తనకున్న ఆత్మస్థయిర్యమొక్కటే చాలన్న అభిప్రాయంతో ఉన్నాడు. ప్రతాపుడి సహాయాన్ని నిరాకరించిన అతడు రాజకుమారిని పులి నుండి కాపాడటం కేవలం యాదృచ్ఛికమనీ క్షత్రియ ధర్మాన్ని మాత్రమే తాను నిర్వర్తించాననీ అన్నాడు.

అప్పుడే ప్రతాపుడికి, తన కూతురుపై అతడికి మరో భావన లేదన్న విషయం అర్థ మయింది. ఆత్మస్థయిర్యంతో బాటు లోక మంటే ఏమిటో తెలియాలని ప్రతాపుడు భావించాడు. ఆయన మంత్రి మాధవశర్మతో సౌమిత్రుడికి ఆత్మస్థయిర్యం అధికంగా ఉన్నదనటం అందుకే.

ముకుందుడికి రాకుమారిని పెళ్ళాడి రాజు కావాలనే ఆశ ఉన్నది. రాజకుమారికి మాత్రం అతడి పట్ల ఆసక్తి లేదని తెలిసిన రాజు ఈ విషయంలో ఏ చొరవా తీసుకోలేదు. అయిష్టం గానే ముకుందుణ్ణి సైన్యాధిపతి చేశాడు.

ఆటవికుల్ని అణిచివేయటంలో అతడు చూపిన తెగువనీ, నడిపిన రాజతంత్రాన్నీ ప్రతా పుడు మెచ్చుకున్నప్పటికీ ముకుందుడు చేయగల కుతంత్రాల్ని కూడా గుర్తించాడు. అదేవిషయం మంత్రికి చెప్పాడు. తనకూ, కుమార్తెకు కూడా సదభిప్రాయం లేని ముకుందుడికి రాజ్యభారం అప్పజెప్పటం అతనికి ఇష్టం లేదు.

మానవేంద్రుడికి రాజరక్తం లేకపోయినా వీరుల వంశంలో జన్మించిన వాడు. ప్రజల మధ్య ఉంటూ వారి అభిమానం పొందాడు. రాజుని దైవంగా నమ్మబట్టే అతనికి అప్రదిష్ట తెచ్చే అన్యాయాలపై ధ్వజమెత్తడం. అందు చేతనే అతడు చేసింది తిరుగుబాటు కాదని ప్రతాపుడు గుర్తించాడు.

తన కుమార్తెను చేబట్టి, దేశానికి రాజవ బోయే వాడు సాహసం, ఆత్మస్థయిర్యం లాటి లక్షణాలతో బాటు, తనుంటున్న ఈ ప్రపంచం పట్ల అవగాహనా కలిగి ఉండాలని ఆశించాడు ప్రతాపుడు. మానవేంద్రుడిలో అతనికీ లక్ష ణాలే కనబడ్డాయి.

అంతే కాదు.. ధర్మనిరతుడనిపించుకున్న తనకు వారసుడు కాబోయేవాడు భవిష్య త్తులో ముకుందుడు లాంటి వారు అవరో ధాలు కల్పిస్తే వారిని నిరోధించగలవాడై ఉండా లన్న పరమార్థం కూడా అతని నిర్ణయంలో ఉన్నది.మంత్రి అందుకే, 'ఈ నిర్ణయాన్ని ముందుగా ఊహించాను' అన్నాడు.

రాజుకి ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో సహా మాయమై చెట్టె క్కాడు. - కల్పితం

[ఆధారం : జొన్నలగడ్డ రత్న]





# అన్వయ మంత్రి

ఒకానొకప్పుడు కోసల దేశాన్ని చిత్రముఖుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన మంత్రి సుబుద్ధి, పేరుకు పూర్తిగా వ్యతిరేకం. తన మంత్రి అవినీతిపరుడని తెలుసుకునేందుకు రాజుకు ఎంతోకాలం పట్టలేదు.

ఆయన అసలు విషయం బయటపెట్టకుండా సమర్థుడు, నీతిపరుడు, నిజాయితీని నమ్మినవాడు అయిన వ్యక్తి కోసం, స్వయంగా అన్వేషించసాగాడు.

చివరకు ఒక గ్రామంలో గురుకులం నడుపుతున్న అన్వయుడు అన్నివిధాలా మంత్రి పదవికి తగినవాడని ఆయన నిర్ణయించి, ఆ విషయం లేఖద్వారా అన్వయుడికి తెలియబరిచాడు.

అన్వయుడు దీనికాశ్చర్యపడి, వెంటనే రాజధానికి బయలుదేరి చిత్రముఖుణ్ణి కలుసుకుని, 'ప్రభూ! గురుకులాన్ని నడుపుకోవడంలో నాకెంతో తృప్తి ఉంది. రాజకీయాలు నాకు నచ్చవు. ఈ విషయం మీకు లేఖద్వారా తెలియపర్చడం మర్యాద కాదని, స్వయంగా చెప్పుకునేందుకు వచ్చాను. నాకు మంత్రి పదవి వద్దు,' అన్నాడు.

చిత్రముఖుడు అన్వయుడితో, 'మీకు పదవీ వ్యామోహం లేదు. మీవంటివారే మంత్రి పదవికి అర్హులు. నా మంత్రి సుబుద్ధి పదవీ వ్యామోహంతో, అవినీతికి పాల్పడ్డాడు. ధన వ్యామోహంతో ప్రజా క్షేమాన్ని మరిచాడు. అందుకే అతణ్ణి పదవి నుంచి తొలగిస్తున్నాను. ప్రజాక్షేమాన్ని కోరి మీరీ పదవిని స్వీకరించి, అసమర్థులను కనిపెట్టి, వాళ్ళను తగు రీతిగా శిక్షించండి. సమర్థులకే అన్ని పదవులూ లభించేలా

వసుంధర



నేను నిర్దోషిని. నా క్రిందపని చేసే అధికారు లందర్నీ నేను పూర్తిగా నమ్మాను. రాజు గారికి అవసరమైన కొన్ని ముఖ్య రాజకీయ వ్యవహారాలు తప్ప, మిగతావన్నీ నా క్రింది అధికారులే చూస్తున్నారు' అంటూ నెపం వేరే వాళ్ళ మీదికి నెట్టేశాడు.

సుబుద్ధి క్రింద పనిచేసే అధికారులు వందమంది ఉన్నారు. అన్వయుడు మరునాడు వాళ్ళందర్నీ కలుసుకుని సుబుద్ధి విషయమై ప్రశ్నించాడు.

తప్పంతా మంత్రిదేననీ, ఆయన ఎలా చెబితే అలా చేశామనీ అధికారులన్నారు.

'అంటే మంత్రి చాలా పొరబాట్లు చేశాడు. ఇలాంటి పొరబాట్లు చేసే మనిషి దుర్మార్గుడూ, స్వార్థపరుడూ అయి ఉండాలి. మంత్రి అలాంటి వాడనడానికి, మీ దగ్గిర రుజువులు ఉన్నాయా?' అని అడిగాడు అన్వయుడు.

'సుబుద్ధి దుర్మార్గాలను బయటపెట్టడానికి, మాలో ప్రతి ఒక్కడి దగ్గిరా వందల కొద్దీ రుజువులున్నాయి,' అన్నాడు అధికారుల్లో ఒకడు.

'సరే, మనం మళ్ళీ రేపు కలుసుకుందాం. అప్పుడు నేను సుబుద్ధి గురించి, మీ నుంచి నాక్కావలసిన వివరాలు తెలుసుకుంటాను,' అని అన్వయుడు వాళ్ళందర్నీ పంపించేశాడు.

తర్వాత అన్వయుడు, సుబుద్ధిని వెంటబెట్టుకుని రాజువద్దకు వెళ్ళి,

చూడండి. మీ గురుకులం నడిపే ఏర్పాట్లు నేను చేస్తాను,' అన్నాడు. రాజు మాటలు కాదనలేక, అన్వయుడు మంత్రి పదవికి ఒప్పుకున్నాడు.

అన్వయుడు ఊహించని విధంగా మంత్రి కావడం, తన పదవి పోవడం సుబుద్ధికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

అయితే ఇలా జరుగుతుందని ముందుగా తెలియకపోవడంవల్ల, తన తప్పులు దాచి పెట్టుకునే అవకాశం ఏ మాత్రమూ లేకపోయింది.

మొదటి రోజునే అన్వయుడు సుబుద్ధి కారణంగా జరిగిన పొరబాట్లు చాలా తెలుసుకుని అతణ్ణి సంజాయిషీ అడిగాడు. సుబుద్ధికి ఏం చెప్పాలో తెలియక, 'పొరబాట్లు జరిగిన మాట వాస్తవం. కానీ

‘ప్రభూ! సుబుద్ధి పదవిలో తన క్రింది అధికారులను శాసించాడే తప్ప, వారి నిజమైన అభిమానాన్ని పొందలేకపోయాడు. అందుకే పదవి పోగానే వాళ్ళందరూ ఇతడికి వ్యతిరేకంగా మారిపోయారు,’ అని చెప్పాడు.

‘అయితే ఇతడికేం శిక్ష నిర్ణయించారు?’ అన్నాడు రాజు.

‘ఆ విషయం రేపటికిగానీ తేలదు,’ అన్నాడు అన్వయుడు.

మర్నాడు వందలమంది అధికారులనూ అన్వయుడెలా విచారణ చేస్తాడో చూడాలని, రాజు కూడా అన్వయుడి పక్కనే ఉన్నాడు.



అన్వయుడు, రాజు ఒకే గదిలో పక్క పక్కనే ఆసనాలమీద కూర్చుంటే, ఒక్కొక్క అధికారి విడివిడిగా వచ్చి వాళ్ళను కలుసుకున్నారు.

అన్వయుడు ముందుగా వచ్చిన అధికారితో, ‘పాత మంత్రి సుబుద్ధి గురించి నీకేం తెలుసో చెప్పు.’ అన్నాడు.

వెంటనే ఆ అధికారి, సుబుద్ధికున్న దురలవాట్లన్నీ ఏకరువు పెట్టబోతే, అన్వయుడు అతణ్ణి వారించి, ‘ఇవన్నీ నేను వినదల్చుకోలేదు. సుబుద్ధిలోని మంచి గుణాల గురించికానీ, సమర్థత గురించి కానీ ఏమైనా తెలిస్తే చెప్పు లేదా వెళ్ళిపో.’ అన్నాడు.

ఆ అధికారి ఏమీ చెప్పలేక వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఒక్కొక్కరుగా వంద మంది అధికారులూ వచ్చి వెళ్ళారు. వారిలో పదిమంది మాత్రం, సుబుద్ధిలో కొన్ని మంచి గుణాలున్నట్లు చెప్పారు. వాటిలో ముఖ్యమైనదేమిటంటే– సుబుద్ధి తనకిష్టమైన పనులన్నీ నయానో, భయానో తన క్రింది ఉద్యోగులచేత చేయించగలడన్నది!

అందరూ వెళ్ళిపోయాక అన్వయుడు రాజుతో – సుబుద్ధిలోని మంచి గుణాలు చెప్పిన పదిమందినీ ఉంచి, మిగతా తొంభై మందినీ అధికారం నుంచి తొలగించాలన్నాడు.

అంతేగాక, పాత మంత్రి సుబుద్ధిని కారాగారంలో నేరస్థుల యోగక్షేమాలు విచారించే అధికారిగా నియమించాలన్నాడు.

రాజు ఆశ్చర్యపడి, 'ఇదేమి నిర్ణయం మీది? తప్పు చేసిన సుబుద్ధికి వేరే పదవి ఇవ్వాలంటున్నారు. సుబుద్ధి మాట విన్న క్రింది ఉద్యోగుల్ని పనిలోంచి తీసివేయాలంటున్నారు, న్యాయంగా ఉందా?' అని ప్రశ్నించాడు.

అన్వయుడు నవ్వి, 'ప్రభూ! సుబుద్ధి తప్పుచేసి ఉండవచ్చు. కానీ అతడి క్రింద పనిచేసే వారెవ్వరూ తమ కతడిపై ఫిర్యాదు చేయలేదు. అంటే, అతడు తన క్రింది వారిలో కొంత భయం పుట్టించాడన్న మాట!

ఉద్యోగుల్లో భయం పుట్టించాలంటే కొంత సమర్థత అవసరం. ఆ సమర్థతను మనం ఉపయోగించుకోవాలి. తనకిష్టమైన పనులు క్రిందివారి చేత నయానా, భయానా చేయించగల శక్తి అతడికుంది.

ఇక నుంచి కారాగారం అధికారిగా అతడు తన క్రిందివారి చేత ఏం చేయించాలో నేను నిర్ణయించి పర్యవేక్షిస్తాను. ఆ విధంగా ఎందరో నేరస్థులను మనం సంస్కరించవచ్చు.

అదీగాక,-ఈ ఉద్యోగం వల్ల సుబుద్ధి ఎక్కువసేపు కారాగారంలో నేరస్థుల మధ్య గడపాలి. అదే అతడికి తగిన శిక్ష.

ఇక సుబుద్ధి క్రింద పనిచేసిన ఉద్యోగులంటారా? ఎదుటివారిలో ఎన్నడూ చెడునే తప్ప మంచిని చూడలేనివారు రాజోద్యోగులుగా అస్సలు ఉండకూడదు. అందుకే అటువంటి వారైన నూటికి తొంభై మందిని పనిలోంచి తీసివేయాలన్నాను.' అన్నాడు.

'మీరు నేననుకున్నదానికంటే చాలా గొప్పవారు. మంత్రి అంటే అన్వయ మంత్రే మంత్రి!' అని రాజు చిత్రముఖుడు అన్వయుణ్ణి ఎంతగానో మెచ్చుకుని సత్కరించాడు.

ఆ తర్వాత అన్వయుడి సమయోచితమైన సలహాలతో, చిత్రముఖుడు ఎంతో కాలం సుఖంగా రాజ్యమేలాడు.





# శ్రీనివాస కల్యాణం - 8

## కల్యాణం

కుబేరుడు అప్పుగా ఇచ్చిన పధ్నాలుగు లక్షల శ్రీరామ ముద్రలున్న మాడలను శ్రీనివాసుడు కుబేరునికే ఇచ్చి వివాహానికి వ్యయం చేయమన్నాడు.

కుబేరుడు వంటకు అవసరమైన సామగ్రిని పెద్దమొత్తంలో కొని తెప్పించాడు.

వంటపనికి నియోగింపబడిన అగ్ని దేవుడు అవసరమైన పాత్రలు లేవన్నాడు.

వివాహానికి ఆహూతులై విచ్చేసిన దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుష, మహర్షి బృందాలను దృష్టిలో ఉంచుకుని వండటానికి శ్రీనివాసుడు అగ్నికి ఒక ఉపాయం చెప్పాడు.

''అగ్నీ. పుష్కరిణిని పాత్రగా చేసుకుని అందులో అన్నం వండు. పాపవినాశిని తీర్థంలో పప్పు, ఆకాశగంగా తీర్థంలో బెల్లం పరమాన్నమూ, దేవ తీర్థంలో కూర, తుంబురు తీర్థంలో పులిహోర, కుమార తీర్థంలో వివిధ రకాల పిండివంటలు, పాండు తీర్థంలో చారు, ఇతర తీర్థాలలో కందమూల ఫలాలతో చేసే కూరలూ వండు'' అన్నాడు శ్రీనివాసుడు.

శ్రీనివాసుడి మహిమతో ఆ తీర్థాలన్నీ భారీస్థాయి వంటపాత్రలుగా రూపొందాయి. అగ్నిదేవుడు సతీసమేతంగా ఆరు రుచులతో కూడిన ఆహార పదా

వక్కలంతం సూర్యనారాయణ రావు



ర్థాలను సిద్ధం చేశాడు. అగ్నిదేవుడు అటు పిమ్మట శ్రీనివాసుడిని దర్శించుకుని ఇలా అన్నాడు. ''చిత్రాన్నం, దధ్యోజనం, తేనెతో పరమాన్నం, రకరకాల భక్ష్యాలు, అప్పాలు, కూరలు చక్కగా వండి సిద్ధం చేశాను.''

వివాహానికి విచ్చేసిన వారిని అందరినీ భోజనం ఆరగించమని ఆహ్వానించాడు శ్రీనివాసుడు. అప్పుడు బ్రహ్మ ''శ్రీనివాసా.. భగవంతుడికి నివేదించకుండా భోజనం చేయడం అపచారం కదా.. నీ వివాహ సంబంధమైన స్నాతకంలో ఆహారాన్ని ఎవరికి నైవేద్యంగా సమర్పించాలో తోచకుండా ఉంది. మీరే సెలవియ్యాలి'' అన్నాడు.

''ఘన నైవేద్యాన్ని స్వీకరించే అర్హత కలిగిన మహా నైవేద్య భోక్త ఉన్నారు కదా, కుమారా..'' అన్నాడు శ్రీనివాసుడు చిరునవ్వుతో.

''మహా నైవేద్యభోక్త.. అతడు ఎవరు జనకా..'' అన్నాడు బ్రహ్మ.

''ఇంకెవరు చతుర్భుజా.. అహోబిల మహాబలుడు నరసింహదేవుడు'' శ్రీనివాసుడు చిరునవ్వుతో అన్నాడు.

బ్రహ్మదేవుడు అహోబిల నరసింహ స్వామిని ఆహ్వానించాడు. ఆయనకు శాస్త్ర సమ్మతంగా అర్చించి, ఆహార పదార్థాలన్నింటినీ నివేదన చేశాడు.

దేవతలూ, మహర్షులూ, గంధర్వులూ... ఇతరులూ బారులుతీరి కూర్చున్నారు. అష్టదిక్పాలకులైన ఇంద్రుడు, అగ్ని, యమధర్మరాజు, నిర్వతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అందరికీ లోటు లేకుండా వడ్డించారు.

అహూతులందరూ భుజించిన అనంతరం శ్రీనివాసుడు బ్రహ్మనూ, పరమేశ్వరుడినీ, లక్ష్మినీ, దిక్పాలకులనూ, అగ్నినీ, ఆదిశేషుడినీ, గరుత్మంతుడినీ సహపంక్తిలో ఉంచుకుని, అందరితో కలిసి భోజనం చేశాడు.

ఆ రాత్రి అందరూ వేంకటాద్రి మీదనే విశ్రమించారు. మరుసటి ఉదయం వధువు పట్టణం అయిన నారాయణ



మీద బయలుదేరాడు. కుబేరుడు భయంకరాకారుడైన నరవాహనం ఎక్కాడు.

వాయువు జింకను అధిరోహించాడు. నైరుతి తన గార్దభ వాహనంమీద బయలుదేరాడు.

ఇతర దేవతా స్వరూపులైన గంధర్వులూ, విద్యాధరులూ, కిన్నెరలూ, కింపురుషులూ అందరూ తమ తమ వాహనాలపై శ్రీనివాసుడిని అనుసరించారు.

వేంకటాద్రి నుంచి బయలుదేరిన ఆ దేవ పరివారం అందరికీ కనువిందు చేస్తూ కదిలింది. నవగ్రహదేవతలైన సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని, రాహువు, కేతువు తమ తమ దివ్య రథాలను అధిరోహించి బయలుదేరారు. దేవతా స్త్రీలందరూ తమ భర్తల వాహనాలమీద కూర్చున్నారు.

మార్గమధ్యంలో ఉన్న పద్మ తీర్థం అనే మహా పుష్కరిణిని తన పరివారంతో సమీపించాడు శ్రీనివాసుడు. ఆ పుష్కరిణి సమీపంలో ఉన్న శుకయోగ ఆశ్రమాన్ని సందర్శించాడు.

శుకమహర్షి భక్తి శ్రద్ధలతో అందజేసిన ఆతిథ్యాన్ని స్వీకరించి, పరివారంతో పాటు ఆయనను కూడా వెంటేసుకుని నారాయణపురంవైపు తన మహా ప్రయాణాన్ని కొనసాగించాడు.

పురం బయలుదేరి వెళ్ళేందుకు నిర్ణయం జరిగింది.

మరునాటి ఉదయం శ్రీనివాసుడు సకల దేవతా సమూహంతో కలిసి ఆకాశ రాజు పట్టణానికి పయనం కట్టాడు. తన వాహనం అయిన గరుత్మంతుడిని అధిరోహించాడు శ్రీనివాసుడు.

బ్రహ్మదేవుడు తన తెల్లహంస వాహనం ఎక్కాడు. శివుడు నందీశ్వరుడిని అధిరోహించాడు. ఇంద్రుడు ఐరావతం అనే నాలుగు దంతాల ఏనుగునూ, అగ్ని దేవుడు పొట్టేలునూ ఎక్కారు.

యమధర్మరాజు పౌండ్రకం అనే పేరు కలిగిన మహిషాన్ని అధిరోహించాడు. వరుణుడు జలధి అనే మొసలివాహనం

నారాయణపురంలో అంతఃపుర స్త్రీలు పద్మావతిని పెండ్లి కుమార్తెగా అలంకరించారు. పందిళ్ళతో, తోరణాలతో నగరాన్ని అందంగా అలంకరించారు. సకల దేవతల సాక్షిగా జరగనున్న ఈ వివాహానికి నవరత్నాలతో అద్భుతమైన మండపాన్ని నిర్మించారు మహాశిల్పులు.

వధువుగా అలంకరించబడిన పద్మావతిని ఏనుగుమీద కూర్చుండబెట్టి, పరివార సమేతంగా, మంగళ వాద్యాలతో శ్రీనివాసుడికి ఎదురుగా తీసుకువెళ్ళారు ఆకాశరాజు దంపతులు.

ఎదురుకోలు అనే వివాహసంబంధమైన కార్యక్రమంలో వధూవరులైన పద్మావతీ శ్రీనివాసులు ఒకరినొకరు చూసుకున్నారు.

అప్పుడు ఆకాశరాజు దంపతులను నారదుడు శ్రీనివాసుడికి పరిచయం చేశాడు.

నారాయణపురం ద్వారం వద్ద ఉన్న ఆలయంలో దుర్గను శ్రీనివాసుడూ, పద్మావతీ దర్శించి, అర్చనలు చేశారు. తమ వివాహం నిర్విఘ్నంగా జరిగేలా దీవించమని ఇద్దరూ జగన్మాత అయిన దుర్గను వేడుకున్నారు.

అనంతరం ఆకాశరాజు వధూవరులను నారాయణ పుర వీధులలో ఊరేగించాడు. పుర స్త్రీలు వధూవరుల మీద అక్షరాలూ, పేలాలూ, పుష్పాలూ వర్షించారు.

వధూవరుల అతిలోక సౌందర్యం పుర జనులకు నేత్రపర్వం చేసింది. మహ





గాయి. సాయంత్రం కాగానే ఆకాశరాజు బంధుమిత్ర పరివార సమేతంగా విడిదికి వెళ్లి, శ్రీనివాసుడిని కళ్యాణ మండపానికి సవినయంగా ఆహ్వానించాడు.

ధరణీదేవి కాబోయే అల్లుడికి వశిష్ట మహర్షి సూచన మేరకు ఉపచారాలు చేసింది. శ్రీనివాసుడు తన పరివారం వెంటరాగా, రాజ నగరులోని కళ్యాణ మండపానికి విచ్చేశాడు.

పురోహితుని సూచనను అనుసరించి ఆకాశరాజు స్వామి పుష్కరిణి తీర్థంలో శ్రీనివాసుడి పాదాలను కడిగాడు.

వరుని కాళ్ళు కడగటానికి ధరణీదేవి నీళ్ళుపోస్తూ ఉంటే, పురుషసూక్తం పఠిస్తూ ఆయన పాదాలను కడిగాడు.

ర్షులు పఠిస్తున్న వేద మంత్రాల ఘోష, మంగళవాయిద్యాల శ్రావ్యమైన శబ్దాలతో శృతి కలిపింది.

నవ రత్నాలతో, పుష్పాలతో మనోహరంగా అలంకరించబడిన విడిది గృహంలో శ్రీనివాసుడు తన దేవతా పరివారంతో విడిది చేశాడు.

ఆకాశరాజు సోదరుడు తొండమాన్ చక్రవర్తి ఆధ్వర్యంలో వరుని పరివారానికి విందు భోజనం అందజేయబడింది.

ఆ రాత్రి గడచి తెల్లవారింది. అది శుక్రవారం. దశమ తిథి. ఆ రాత్రి పదమూడు ఘడియలకు సుమూహర్తం అయినందువల్ల, పగలంతా వివాహ పూర్వ కార్యక్రమాలు శాస్త్రోక్తంగా జరి

కన్యాదాన సమయంలో ఆయన శ్రీనివాసునికి వజ్రకిరీటాన్నీ, కంఠాభరణాలనూ, కేమందాలనూ, భుజకీర్తులనూ, వజ్రకంకణాలనూ, బంగారు మొలనూలునూ, రత్నాలు చెక్కిన పాదుకలనూ బహూకరించాడు.

మాంగల్య ధారణకు ముందుగా దేవ గురువు బృహస్పతి పద్మావతి ప్రవరను ఈ విధంగా పఠించాడు.

"అత్రి గోత్రంలో జన్మించినదీ, సువీరుని మునిమనుమరాలూ, సుధర్మను మనుమరాలూ, ఆకాశరాజు పుత్రికా అయిన సౌభాగ్యవతి పద్మావతిని స్వీకరించు."

అదే విధంగా వశిష్ట మహర్షి శ్రీనివాసుని ప్రవరను పఠించాడు.

''వసిష్టగోత్రోద్భవుడూ, యయాతి మునిమనుమడూ, శూరసేనుని మనుమడూ, వసుదేవుని పుత్రుడూ అయిన శ్రీనివాసునకు సౌభాగ్యవతి పద్మావతిని స్వీకరిస్తున్నాం.''

తదనంతరం ఆకాశరాజు శ్రీనివాసుని చేతికి కంకణం కట్టాడు. పద్మావతి చేతికి బృహస్పతి కంకణం కట్టాడు.

వేదమంత్రాలతో పవిత్రం చేయబడిన మంగళసూత్రాన్ని శ్రీనివాసుడు పద్మావతి మెడలో కట్టాడు. వశిష్ట మహర్షి వేదోక్తంగా వధువు పద్మావతిచేత లాజ హోమం చేయించాడు.

దేవతలూ, మహర్షులూ, బంధు మిత్రులూ అందరూ నవరత్నాలు కలిపిన అక్షింతలనూ వధూవరుల శిరస్సుల మీద వర్షించారు.

మాంగల్యధారణ అనంతరం వధూ వరులను రత్న సింహాసనంమీద ఆసీనులను చేశారు. ఆకాశరాజు పాలగిన్నెను చేతిలో ఉంచుకుని, అల్లుడిని పూజించాడు.

వధువు పద్మావతి నాభిని పాలతో తుడిచి, శ్రీనివాసుని మాతృమూర్తి స్థానంలో ఉన్న వకుళమాలికకూ, శ్రీమహాలక్ష్మికీ అప్పగింతలు చేశారు ఆకాశ రాజు దంపతులు.

వకుళమాలిక ఒక యుగానంతరం తన కోరిక తీరటంతో ఆనందబాష్పాలు రాల్చింది.

వధూవరుల వేషభూషణాలతో అప్రాకృతమైన దివ్య సౌందర్యంతో, కిరీటాలతో, పూలమాలలతో కళ్ళకు విందు చేస్తున్న శ్రీ పద్మావతీ శ్రీనివాసులమీద దేవతలూ, మహర్షులూ పుష్పవృష్టి కురిపించారు.

(శుభం)





# పంచతంత్ర కథలు

నక్క సింహం వద్దకు వెళ్ళి, 'మహాప్రభూ, అరణ్యం అంతా గాలించాం. ఎక్కడా ఒక్క జంతువైనా కనిపించలేదు. మాకు శోష వచ్చేసింది. ఒక్క అడుగు కదలలేం. మీకు కూడా ఆహారం ఎంతైనా అవసరం. మీరు ఒప్పుకుంటే వికటాన్ని చంపి, మంచి మాంసం సంపాదించవచ్చు!' అన్నది.

ఈ మాటలు విని సింహం నక్కపై మండిపడి, 'ఛీ, వెధవా! అలాటి పాపిష్టి మాట మరొకసారి అన్నావో నిన్ను తక్షణం చంపేస్తాను. నేను వికటానికి అభయం ఇచ్చి ఉన్నాను. అలాటప్పుడు దాన్ని ఎలా చంపగలను?

అభయదానం గోదానం కన్నా, భూదానంకన్నా, అన్నదానంకన్నా ఎక్కువైనదని పెద్దలు చెబుతారు,' అన్నది.

'అభయం ఇచ్చిన మీరే ఒంటెను చంపితే, అది పాపమే అవుతుంది. కానీ అదే వచ్చి మీ కాళ్ళమీద పడి, తనను చంపమని ప్రార్థించినట్లయితే మీరు దాన్ని చంపవచ్చు. ఇందుకు కూడా ఏలినవారు ఒప్పుకోకపోతే, మా మిగిలిన ముగ్గురిలో ఎవ్వరినైనా తినెయ్యండి. ఎందుకంటే మీకు ఆహారం ఎంతైనా అవసరం. మీరే ఆకలితో చావటం జరిగితే, మేమంతా మీ చితిమీద కాలిపోవలసిన వాళ్ళమే గద!' అన్నది నక్క.

'సరే, నీ యిష్టం!' అన్నది సింహం.

నక్క మిగిలిన ముగ్గురి వద్దకూ తిరిగి వచ్చి, 'మన రాజుకు ప్రాణం నిలిచేటట్టు లేదు. ఆయన ఆకలికి చావకుండా మనం వెంటనే మన శరీరాలను ప్రభువుకు అర్పిం

మిత్రభేదం - 17

చాలి,' అన్నది. నాలుగూ కలిసి సింహం వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, కన్నీరు కార్చుతూ ఉండిపోయాయి. తన వద్దకు తిరిగి వచ్చిన భృత్యులను చూసి ఆ సింహం.. 'ఆహారంగా జంతువేదైనా దొరి కిందా?' అని అడిగింది.



'మహారాజా, అరణ్యమంతా మరొక సారి గాలించాం. ఎక్కడా ఒక్క జంతువు కనిపించలేదు. అందుచేత, నన్ను అనుగ్ర హించి ఆహారంగా తీసుకుని, విలువైన మీ ప్రాణాలు కాపాడుకోండి. అందువల్ల నాకు ఇహమూ, పరమూ కూడా ఉంటాయి,' అన్నది కాకి.

ఈ మాట విని నక్క, 'నువ్వు అల్ప ప్రాణివి. నిన్ను తిని మన యజమానికి ప్రాణాలు నిలవటం అసంభవం. పైగా నిన్ను తింటే పాపమని శాస్త్రాలు కూడా చెబుతున్నాయి. కాకి మాంసం, కుక్క మాంసమూ ఆరోగ్యాన్ని పాడు చేస్తాయట. అయితే నీ స్వామిభక్తి మాత్రం చాలా గొప్పది. నీ కీర్తి మూడు లోకాలా వ్యాపి స్తుంది. అందుచేత పక్కకు జరుగు. నేను కూడా ప్రభువుకు విజ్ఞాపన చేసుకోవాలి,' అని, సింహంతో తనను తిని ప్రాణాలు నిలుపుకోమని విన్నవించుకున్నది.

నక్క ఇలా అనే సరికి చిరుతపులి, తాను కూడా కుట్రలో చేరినదే కనుక తన వంతుగా, 'ఓ నక్కా, ఎంత చక్కగా చెప్పావు! నువు కూడా అల్పప్రాణివే. అదీగాక నువు కూడా గోళ్ళున్న జంతువే గనక; సింహం కులానికి చెందిన మృగానివే అవుతావు. నిన్నుకూడా సింహం తినరాదు,' అన్నది. తరువాత అది సింహంతో, 'మహారాజా, మీ ప్రాణాలు నిలుపుకునేటందుకు నన్ను తిని నాకు ఈ లోకంలో శాశ్వత కీర్తి, పర లోకంలో శాశ్వత సుఖమూ కలిగించండి! అంతకన్న నేను కోరేదేమీ లేదు, అన్నది.

మిగిలిన జంతువులన్నీ ఇలా అనటం విని ఒంటె, ''ఈ ముగ్గురూ ఎంతో ఉదా రంగా మాట్లాడారు. కానీ సింహం వీటిలో ఎవరినీ చంపలేదు. అందుచేత నేను కూడా నన్ను తినమని వేడుకుంటాను. ఈ మూడూ నా ప్రాణానికి కూడా అడ్డుపడ తాయి'' అనుకున్నది.

ఒంటె ఇలా అనుకుని, 'ఓ చిరుతపులీ! నువ్వు గొప్పగా మాట్లాడావు. అయితే నువ్వు కూడా గోళ్ళున్న జంతువేగద. మన యజమాని నిన్ను తినటం ఎలా పొసగుతుంది? నువు పక్కకు తొలగు. నేను కూడా విజ్ఞాపన చేసుకోవాలి' అని తాను కూడా సింహం ముందుకు వచ్చి, నమస్కరించి, ఇలా అన్నది.

'మహాప్రభూ, ఈ ముగ్గురూ తమకు ఆహారంగా పనికిరారు, అందుచేత నన్ను తిని మీ అమూల్యమైన ప్రాణాలు రక్షించుకోండి. యజమాని కోసం ప్రాణాలు అర్పించిన వాళ్ళకు వచ్చే స్వర్గ సుఖం యజ్ఞాలవల్లా, యాగంవల్లా కూడా రాదంటారు,' అన్నది.

ఒంటె ఇలా అనగానే సింహం సైగ చేసింది. వెంటనే నక్కా, చిరుతపులీ దాని మీద పడి, క్షణంలో చీల్చి చంపేశాయి. ఆ ఒంటెను తిని సింహమూ, దాని ముగ్గురు భృత్యులూ తమ ప్రాణాలు పోకుండా కాపాడుకున్నాయి.

సంజీవకం దమనకానికి ఈ కథ చెప్పి, 'అబ్బీ! ఎవరో కుట్ర వెధవలు నా మీద పింగళకం మనస్సు విరిచారని నా అనుమానం. మంచి మంత్రులు గల చెడ్డ రాజు కన్న చెడ్డ మంత్రులు గల మంచి రాజు మరీ అన్యాయం. గద్దలు మంత్రులుగా గల హంసకన్న, హంసలు మంత్రులుగా గల గద్ద మేలు. ఎవరో దుర్మార్గులు నాకూ, పింగళకానికీ మధ్య భేదం కలిగించారు. ఇప్పుడు పోరాడటం తప్ప చేసేది ఏమీ కనబడటం లేదు.

మంచి మాటలూ, కుట్రలూ, కానుకలూ ఇక పని చెయ్యవు. ఇంత జరిగాక సామదానభేదాలు లాభం లేదు గనక యుద్ధం తప్పదు. అందులో ఓడానా, స్వర్గానికి పోతాను. గెలిచానా, హాయిగా జీవిస్తాను,' అన్నది. (ఇంకా ఉంది)





# వీరయ్య గోదానము

వసంతవాడ అనే గ్రామంలో వీరయ్య అనే రైతుండేవాడు. ఒకరోజు పొలంలో రెండెండ్ల బండిలో ఎరువుల బస్తాలు తీసుకువెళ్ళి కూలీల చేత చల్లించాడు. ఆ తరువాత కను చీకటి పడుతుండగా ఖాళీ బండి తోలు కుంటూ తిరిగి ఇంటికి వస్తున్నాడు. సరిగ్గా సాటిరైతు రమణయ్య పొలం దగ్గరకు వచ్చే సరికి అక్కడ పశువుల పాక దగ్గర హడా వుడిగా ఉంది. రమణయ్య కంగారుగా బండికి అడ్డంపడి విచారంగా 'వీరయ్యా! మా తెల్లావు దూడ చనిపోయిందగ్గరనుంచీ పాలివ్వడము లేదు. చేట పెయ్యను చేయిం చినా ప్రయోజనము లేకుండా పోయింది. రోజూ దాన్ని చితకబాదుతున్నాను. ఇవాళ కోపంతో రెచ్చిపోయి పొదుగును కూడా గాయపరిచాను. అది స్పృహతప్పిపోయింది. చచ్చిపోతుందని భయంగా ఉంది. నీ బండిలో గ్రామ పశువైద్యుని వద్దకు తీసుకు వెళదాం. నా అదృష్టం బాగుంటే నాకు గోహత్యా పాపం తగులుకోదు,' అన్నాడు కళ్ళనీళ్ల పర్యంతమవుతూ.

వీరయ్య రమణయ్య కలిసి మరికొంత మంది సాయం చేయగా ఆవును బండిలోకి ఎక్కించారు. ఆవు చాలా దయనీయ స్థితిలో ఉంది. ఒంటి మీద దెబ్బలు కనిపిస్తు న్నాయి. పొదుగునుంచి రక్తం స్రవిస్తోంది. వీరయ్య బండిని వేగంగా పరుగెత్తించాడు. గ్రామ వైద్యుని ఇంటి దగ్గర బండి ఆపాడు. పశువైద్యుడు బండిలోంచి ఆవునుదింపించి చాలాసేపు చికిత్స చేసి ఆవును రక్షించాడు. మొత్తానికి ఆవు లేచి నిలబడగలిగింది. రమ ణయ్య గోహత్యాపాపంనుంచి తప్పించావని కృతజ్ఞతలు చెప్పాడు.

'రమణయ్యా! ఆవు బ్రతికింది. మళ్ళీ బండిలో ఆవును ఎక్కించు. నీ పొలం చాలా దూరం కదా! మా ఇంటి దగ్గర గల నా పశు

జొన్నలగడ్డ మార్కండేయులు

వుల కొట్టంలో ఉంచుకుంటాను. దగ్గర ఉండడం వలన అదునుకు వేయవలసిన మేతకుగాని, ఆవు పూర్తిగా కోలుకునేదాకా వైద్యుడు వచ్చి చూడడానికి కూడా అను కూలం,' అన్నాడు వీరయ్య.

వైద్యుడు మాట్లాడుతూ, 'ఆవుకు ప్రమాద పరిస్థితి తప్పింది. కానీ పొదుగు గాయం మానడానికి రెండు, మూడు రోజులైనా మందువేసి కట్టు కట్టాలి. నీరసంగా ఉంది కాబట్టి నిలబడే స్థితిలో ఉన్నా నడిపించ డము నోరులేని జంతువును హింసించటమే అవుతుంది. జాగ్రత్తగా బండిలో తీసుకు వెళ్ళ గలిగితే మంచిదే! వీరయ్య ఇంటి దగ్గరికే వచ్చి కట్టు కడతాను. అలా చేయండి' అన్నాడు. రమణయ్య ఒప్పుకున్నాడు. ఆవును జాగ్రత్తగా బండిలో వీరయ్య ఇంటి దగ్గర పశువుల కొట్టంలోకి చేర్చారు.

వీరయ్య సంరక్షణవల్ల, వైద్యుని వైద్యం వల్ల వారం రోజులయ్యేసరికి ఆవు తేరుకుంది. రమణయ్య వచ్చి ఆవును తోలుకుపోతూ 'ఇంకిది పాలివ్వదు. అమ్మేస్తాను. మంచి బేరముంటే చూడు,' అన్నాడు. వీరయ్య ఏమీ మాట్లాడలేదు. కానీ విచిత్రంగా సాయంత్రానికల్లా రమణయ్య ఆవు మళ్ళీ వీరయ్య పశువుల కొట్టంలోకి వచ్చి పడు కుంది. వీరయ్య మేతవేసి రమణయ్యకు కబురు పంపాడు. రమణయ్య వచ్చి ఆవును తీసుకువెళ్ళే ప్రయత్నం చేశాడు. కానీ ఆవు రానని మొండికేయడంతో వీరయ్య నవ్వాడు. 'రమణయ్యా! నోరులేని జంతువైనా దీనికి పౌరుషం ఎక్కువలా ఉంది. నువ్వు అమ్మే స్తావని తెలిసి నా దగ్గరే ఉంటానంటోంది. ఏ రుణానుబంధమో గోమాత నా దగ్గరే ఉంటానంటే వద్దనాలనిపించడము లేదు. ఏదో ధర చెప్పు నేనే కొనుక్కుంటాను,' అన్నాడు వీరయ్య.

'ఇప్పటికే దాన్ని హింసించి పాపం మూట కట్టుకున్నాను. సాటి రైతుకు ధర చెప్పడ మేమిటి. కానీ నీకు తోచిందిచ్చి సొంతమని పించుకో. ఆవులకు జ్ఞానముంటుందట. అది నిన్ను యజమానిగా భావించి పాలివ్వడం చేసినా నేను సంతోషిస్తాను,' అని చెప్పిన రమణయ్య మారుబేరం లేకుండా, వీరయ్య ఇచ్చింది పుచ్చుకుని వెళ్ళిపోయాడు.





# వింతపోటీ

అవంతీ రాజ్యంలో యుద్ధ భయాలు లేకుండా పాలన కొనసాగడంతో రాజ్యం సుభిక్షంగా ఉండేది. అక్కడి ప్రజలు చీకూ చింతా లేకుండా కాలం గడిపేవారు. శత్రువుల నుంచి ప్రమాదం తొలగిపోవడంతో, రాజ్యంలో ప్రతి సంవత్సరం ఆటల పోటీలు, పరుగు పందాలు, రకరకాల పోటీలు నిర్వహిస్తారు. ప్రతి ఏడాది ఏదో ఒక కొత్త పోటీని ప్రవేశపెడతారు. విజేతలకు మంచి బహుమతులు కూడా ప్రకటిస్తారు కాబట్టి పోటీదారులు ప్రతి ఏటా పెద్ద సంఖ్యలో ఈ పోటీలలో పాల్గొంటుంటారు.

యధావిధిగా ఆ ఏడాది కూడా మంత్రి ఒక వింతపోటీని నిర్వహించాడు. అది ఏమిటంటే, పోటీదారులు రాజ భవంతి మీదనుంచి నేలమీదకు దూకాలి. అలా భవంతి మీద నుంచి క్షేమంగా దూకగలిగిన వారికి మహారాజు ఒక లక్ష వరహాలు బహుమతిగా ఇస్తారు.

బహుమతికి ఆశపడి చాలామంది యువకులు పోటీలు పడుతూ భవనం మీదకు ఎక్కి దూకడానికి ప్రయత్నం చేశారు. కాని భవంతి చాలా ఎక్కువ ఎత్తులో ఉండటంతో ఎవరూ సాహసించి కిందికి దూకలేకపోయారు. దాంతో మంత్రి లక్ష వరహాల మూట పైకి ఎత్తి అందరికీ కనబడేలా చూపిస్తూ, ‘‘ఈ లక్ష వరహాలను గెలుచుకునే వీరుడే ఇక్కడ లేడా?'' అని బిగ్గరగా అరిచాడు.

అప్పుడు సమూహంలోంచి గంగన్న అనే వ్యక్తి భవనంపైకి ఎక్కి, ఏమాత్రం భయపడకుండా, లాఘవంగా కిందికి దూకేశాడు. అందరూ ఆనందంతో చప్పట్లు

దొడ్డిపట్ల పూర్ణిమ

చరిచారు. రాజు 'భేష్' అని గంగన్నను మెచ్చుకున్నాడు.

తరవాత వివిధ పోటీల్లో గెలిచిన విజేత లకు బహుమతి ప్రదానం చేస్తున్నారు. ఒక్కొక్క విజేత వెళ్ళి మహారాజుగారి చేతుల మీదుగా బహుమతి అందుకు న్నారు. కాస్సేపయ్యాక "భవనం మీద నుంచి కిందకి దూకిన విజేత గంగన్న" అని రాజు గంభీరంగా పిలిచాడు.

గంగన్న వెళ్ళి రాజుకు నమస్కరించి నిలబడ్డాడు. మాట ప్రకారం రాజు, గంగ న్నకు లక్ష వరహాల మూటను బహూ కరించబోయాడు. వెంటనే మంత్రి రాజును వారించి "ఈ గంగన్నను బంధించండి" అని భటులను ఆదేశించాడు. సభికులు, రాజు ఆశ్చర్యంతో మంత్రివైపు చూశారు.

అప్పుడు మంత్రి, "ప్రభూ, గత నెలలో మన ఖజానాను దోచుకున్న వ్యక్తి ఈ గంగన్నే," అన్నాడు. రాజు దానికి రుజు వేమిటన్నట్లు మంత్రి వైపు చూశాడు.

"ప్రభూ, ఈ దొంగ మన ఖజానాను దొంగిలించి పారిపోతున్న సమయంలో మన సైనికులు గమనించి వెంబడించారు. అప్పుడితడు అతి లాఘవంగా మన భవంతి నుంచి కిందకు దూకి తప్పించుకున్నాడు. తరవాత ఎంత విచారించినప్పటికీ దొంగ ఆనవాళ్ళు దొరకలేదు. ఈ దొంగను పట్టు కునేందుకే నేను ఈ పోటీని నిర్వహించాను. పోటీలో ఏ ఒక్కరూ చేయలేని పనిని ఈ గంగన్న మాత్రమే సాహసవంతంగా చేయ గలిగాడు. నిజంగానే అతనికి గోడలు దూకే విద్యలో చాలా ప్రావీణ్యం ఉందన్న విషయం మీరంతా ఇంతకు ముందే చూశారు గదా," అన్నాడు మంత్రి.

రాజాజ్ఞ ప్రకారం భటులు గంగన్నను బంధించి, తీవ్రంగా విచారించారు. గంగన్న చివరకు నిజాన్ని అంగీకరించి కారాగారానికి వెళ్ళిపోయాడు. చిక్కు సమస్యను యుక్తితో పరిష్కరించడంతో అందరూ మంత్రి తెలివిని కొనియాడారు.





# పేదవరుడు

సీతారామయ్య పేద రైతుగా జీవితం ప్రారంభించి స్వయంకృషితో గొప్పవాడై డబ్బు కూడా బాగా కూడబెట్టాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురు రాధ. ఆమె చిన్నతనం నుంచీ పెద్దలపట్ల వినయ విధేయతలతో మసులుతూ అన్ని విద్యలూ నేర్చుకున్నది.

రాధకు పెళ్ళీడు రాగానే ఎక్కడెక్కడి నుంచీ సంబంధాలు వెతుక్కుంటూ వస్తున్నాయి. ఎందుకంటే రాధ అందంలో అప్సరస కూడా. అయితే సీతారామయ్య మాత్రం, తన కూతుర్ని ఎట్టి పరిస్థితుల్లోనూ పేదవారింట ఇవ్వనని స్పష్టం చేశాడు. ఈ విషయం తెలిసి పక్క గ్రామంలోని విజయుడనేవాడు, రాధను పెళ్ళి చేసుకోవాలని మోజుపడ్డాడు. విజయుడు కోటీశ్వరుడు. ఊళ్ళో సగం పొలాలు వాడివే. పైనా, నాలుగు దుకాణాలు, వడ్డీవ్యాపారం, మూడు మేడలు వున్నాయి.

తనకంటే డబ్బున్నవాడు చుట్టుపక్కల ఉండడన్న గర్వంతో, వాడు ఒక పెళ్ళిళ్ళ పేరయ్యను పిలిచి, 'నాకు ఇంత డబ్బున్నా అందం, గుణం, చదువు ఉన్నాయని నేను రాధ అంటే ఇష్టపడ్డాను. లక్ష వరహాలు కట్నమిస్తే చాలు, రాధను పెళ్ళి చేసుకుంటాను. పెళ్ళి సంబంధం కుదుర్చు. సీతారామయ్య మరీ లక్ష వరహాలు ఇవ్వలేనని అంటే, ఎనభై వేల వరహాలకు ఒప్పించు. నువ్వు నాకు ఈ సాయం చేస్తే, నీకు వెయ్యి వరహాలు బహుమతిగా ఇస్తాను,' అన్నాడు.

వెయ్యి వరహాలు వస్తాయన్న ఉత్సాహంతో పేరయ్య, అప్పటికప్పుడే సీతారా

జొన్నలగడ్డ రామలక్ష్మి

మయ్య ఇంటికి వెళ్ళి విజయుడి గురించి చెప్పాడు.

సీతారామయ్య పెదవి విరిచి, 'ముందే చెప్పాను. మా అమ్మాయిని పేదవాళ్ళింట ఇవ్వదల్చుకోలేదు,' అన్నాడు. పేరయ్య తెల్లబోయి, 'విజయుడు మీకంటే ఏ విధంగానూ పేదవాడు కాదు. లక్షవరహాలు కట్నమివ్వడం ఇష్టంలేక, మీరతణ్ణి చిన్న బుచ్చడం మర్యాద కాదు,' అన్నాడు.

సీతారామయ్య దీనికి బదులివ్వలేదు. పేరయ్య కోపంగా, 'ఇంతకంటే గొప్ప సంబంధం ఎక్కణ్ణించి తెస్తారో చూస్తాను,' అంటూ వెళ్లిపోయాడు.

కానీ నిజంగానే అంతకంటే గొప్ప సంబంధం వెతుక్కుంటూ సీతారామయ్య ఇంటికొచ్చింది. వరుడి పేరు అజయుడు. పదికోట్ల ఆస్తికి ఒక్కగానొక్క వారసుడు. పట్నంలో రత్నాల వ్యాపారం ఉన్నది. అజయుడు మనిషి కూడా విజయుడి కంటే ఎంతో అందంగా ఉంటాడు. గతంలో విజయుడు లక్ష వరహాలు కట్నంగా అడిగితే కాదన్నాడని, అజయుడు యాభై వేల వరహాలు కట్నంగా ఇస్తే చాలన్నాడు.

అజయుడి నుంచి ఈ కబురు తీసుకుని వివాహాల వీరయ్య అనేవాడు వచ్చాడు. కానీ సీతారామయ్య, వీరయ్యకు కూడా పేరయ్యకు చెప్పినట్లే చెప్పాడు.

వీరయ్య ఆశ్చర్యపోయి, 'అవునూ, నువ్వు అజయుణ్ణి పేదవాడనడానికి అసలు నీకున్నదెంత? నీ ఆశపోతుతనంవల్ల నీ కూతురికి పెళ్లి కాకుండా పోతుందేమో జాగ్రత్త! ఏ మహారాజో మోజుపడి వచ్చి,



నీ కూతుర్ని చేసుకుంటాడని ఆశపడుతు న్నావేమో! ఆశకు అంతుండాలి,' అంటూ వెళ్లిపోయాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు, ఆ గ్రామంలోనే ఉండే వినయుడనేవాడు సీతారామయ్యను కలుసుకుని, 'నేను మీ అమ్మాయి రాధ అంటే ఇష్టపడుతున్నాను. మీరు ఒప్పు కుంటే ఆమెను పెళ్ళి చేసుకుంటాను. ఆమెకు నేనంటే ఇష్టమేనని ముందే తెలు సుకున్నాను,' అన్నాడు.

సీతారామయ్య వాడితో, 'నాకు పది లక్షల వరహాల రొక్కముంది. ఇరవై ఎక రాల పొలం ఉంది. లక్ష వరహాలు విలువ చేసే నగలున్నాయి. కానీ ఇవేమీ నా కూతు రుకివ్వలేను. వృద్ధాప్యంలో ఏ మనిషికైనా ఆసరాగా ఉండేది డబ్బు మాత్రమే! ఈ డబ్బు, ఆస్తి నేను నా వృద్ధాప్యం కోసం దాచుకుంటున్నాను. అయితే, నా కూతురు నా ఇంట్లో ఎంతో సుఖంగా బ్రతుకుతు న్నది. ఆమెను అంత సుఖంగానూ ఉంచ గల భాగ్యవంతుడికే ఇచ్చి పెళ్ళి చేయాల నుకుంటున్నాను. నీ ఆస్తిపాస్తుల గురించి చెప్పు,' అన్నాడు.

'అయ్యా.. నాలుగేళ్ళ క్రితం నేనీ ఊరు వచ్చి, నాలుగు పాడిగేదెలతో పాల వ్యాపారం ప్రారంభించాను. ఇప్పుడు నా వద్దపది పాడి గేదెలున్నాయి. నాలుగెకరాల పొలం కొన్నాను. అప్పుచేసి సొంత ఇల్లు కూడా కట్టాను. దైవం అనుకూలిస్తే, ఇంటిమీద అప్పు ఈ ఏడాదికి తీరిపోగలదు. నేను మీ అమ్మాయిని సుఖ పెట్టగలనని నమ్ముతు న్నాను. అంతేకాదు. వృద్ధాప్యంలో డబ్బొ



క్కటే ఆసరా అవుతుందని మీరు పొరబడుతున్నారు. కానీ డబ్బు పాపిష్టిది. ముసలితనంలో మిమ్మల్ని అసహాయుల్ని చేసి, అందరూ మీ డబ్బును కాజేయాలనుకుంటారు. కాబట్టి మీరు మీ డబ్బును సత్కార్యాలకు వినియోగించి వదిలించుకోండి. తర్వాత నా దగ్గిరకు వచ్చి ఉండండి. నా వద్ద మీరు సుఖ సంతోషాలతో ఉండగలరని నమ్మగలరు,' అన్నాడు వినయుడు.

సీతారామయ్య, వినయుడికి రాధ నివ్వడానికి అంగీకరించాడు.

ఈ విషయం తెలిసి పేరయ్య, వీరయ్య వినయుణ్ణి కలుసుకుని, 'బాబూ! మేము తెచ్చిన పెద్ద పెద్ద సంబంధాలన్నీ పేదవనీ, ఆ సీతారామయ్య నిన్నెన్నుకున్నాడు. నీ దగ్గిరగానీ తరగని నిధి ఏమైనా ఉన్నదా?' అని అడిగారు.

దానికి వినయుడు నవ్వి, 'విజయుడు రాధను పెళ్ళి చేసుకునేందుకు లక్ష వరహాలడిగాడు. అజయుడు యాభైవేల వరహాలడిగాడు. ఆ విధంగా, సీతారామయ్య డబ్బిచ్చేవాడు, వాళ్ళు పుచ్చుకునేవాళ్ళు అయ్యారు. అంటే, వాళ్ళు సీతారామయ్య కంటే పేదవాళ్ళు. పెళ్ళికి కట్నమడిగేవాడు బిచ్చగాడితో సమానం. బిచ్చగాడు పేదవాడే కదా! నేను రాధంటే ఇష్టపడి, ఆమెను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. ఆమెకు నేనివ్వగల సుఖ సంతోషాల గురించి చెప్పాను. సీతారామయ్యనేమీ డబ్బు అడగలేదు. సరికదా, ఆయనను పోషించడానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్పాను. ఆ విధంగా నేనాయనకంటే ధనికుడినయ్యాను. కాదంటారా?' అన్నాడు.

పెళ్ళికి కట్నమడిగేవాళ్ళందరూ పేదవరులేనన్న సీతారామయ్య అభిప్రాయాన్ని అంతవరకూ గుర్తించలేనందుకు పేరయ్య, వీరయ్య సిగ్గుపడి, వినయుడి ఔన్నత్యాన్ని మెచ్చుకుని వెళ్ళిపోయారు.





# దొరికిన దొంగ

వంగ రాజ్యానికి వైశాలిపురాన్ని రాజధానిగా చేసుకుని జనరంజకంగా పరిపాలిస్తున్నాడు చంద్రశేఖర మహారాజు. ఆయనకి సదా చేదోడువాదోడుగా ఉండే మంత్రి సుమంతుడు.

ఒకరోజు చంద్రశేఖరుడు అన్యమనస్కంగా, దిగాలుగా, అదోలా ఉండటం గమనించాడు మంత్రి సుమంతుడు. ఎంత ఆలోచించినా మహారాజు అలా ఉండడానికి గల కారణం అంతు చిక్కలేదు. బయటికి చెప్పే విషయమే అయితే ఆయనే చెప్తాడు కదా అని ఊరుకున్నాడు.

ఆ రోజు అన్ని కార్యకలాపాలూ పూర్తయిన పిదప సుమంతుడిని తన అంతరంగిక మందిరానికి పిలిపించుకున్నాడు చంద్రశేఖరుడు. అక్కడ చెప్పాడు తన చింతకి గల కారణం.

వైశాలిపురంలో పెద్ద వెంకటేశ్వరస్వామి ఆలయం ఉంది. చంద్రశేఖరుడి వంశీకుల కులదైవం ఆయన. ఆ స్వామికి వజ్రాల కిరీటం చేయించాలన్నది చంద్రశేఖరుడి కోరిక. దాని కోసం దేశ దేశాల నుంచీ ప్రత్యేకమైన వజ్రాలు తెప్పించాడాయన. ఆ వజ్రాల్ని తన మందిరంలో పెట్టించాడు. ఇప్పుడు అందులోని కొన్ని వజ్రాలు మాయమయ్యాయి.

విషయం విని సుమంతుడు ఆశ్చర్యపోయాడు. 'సాక్షాత్తూ తమ అంతరంగిక మందిరంలో దొంగతనమా! అదీ ఇంత కట్టుదిట్టంగా ఉండే భద్రత నడుమ! ఇది బయటివారెవరి పనీ కాదు మహారాజా.. ఖచ్చితంగా ఇంటి దొంగలపనే.. కాపలా దారుల్లోనే ఎవరికో దుర్బుద్ధి పుట్టి ఉంటుంది' అన్నాడు.

కలిగినీడి లక్ష్మి వాసుకి



'మాకూ అలానే అనిపిస్తోంది. అసలు చిక్కంతా అక్కడే వచ్చింది కూడా,' అన్నాడు చంద్రశేఖరుడు.

'అదేమిటి మహారాజా,' అన్నాడు సుమంతుడు.

'నా మందిరం నుండి కోట ద్వారం వరకూ అంచెలంచెలుగా కాపలా కాస్తున్న వాళ్ళు ఎప్పటినుంచో మనవద్ద నమ్మకంగా పనిచేస్తున్నవాళ్ళు. అందులో ఎవరో ఒకరు చేసిన పనికి అందరినీ అనుమానించి వాళ్ళని బాధపెట్టడం సమంజసం కాదనిపిస్తోంది.'

'అదీ నిజమే మహారాజా.. అయినా మీరేం దిగులు పడకండి. ఎవరికీ ఎలాంటి బాధా కలగకుండా దోషిని నేను పట్టుకుంటాను కదా.'

'మీమీద నాకా నమ్మకం ఉంది మంత్రి వర్యా... అందుకే మిమ్మల్ని పిలిపించాను. దోషి దొరికేవరకూ దొంగతనం విషయం రహస్యంగానే ఉంచండి.'

'లేదు మహారాజా... దొంగతనం విషయం వెల్లడి చేయండి. దొంగని పట్టుకోవడానికి ప్రత్యేక దళాన్ని నియమించినట్టు కూడా.. మిగతా సంగతి నేను చూసుకుంటాను.'

ఆ బాధ్యత సుమంతుడికి అప్పగించిన చంద్రశేఖరుడు ఒక నిట్టూర్పు వదిలాడు బరువుగా...

వారం రోజుల తరువాత వజ్రాల దొంగతనం నేరం కింద విజయుడనే కాపలాదారుడిని బంధించి చెరసాలలో ఉంచాడు సుమంతుడు.

'ఆ విషయం తెలిసి విజయుడా దొంగతనం చేసింది?!' ఆశ్చర్యంగా అడిగాడు చంద్రశేఖరుడు.

'కాదు మహారాజా!' అన్నాడు సుమంతుడు.

'మరి' మరింతగా ఆశ్చర్యపోయాడు మహారాజు.

సుమంతుడు చిరునవ్వు నవ్వాడు. 'అసలు దొంగని పట్టడానికే ఇదంతా మహారాజా! త్వరలోనే దొంగ దొరుకుతాడు, వజ్రాలతో సహా,' అన్నాడు.

అన్నట్టే నాలుగు రోజుల తరువాత అసలు దొంగని వజ్రాలతో సహా పట్టుకుని కారాగారంలో వేయించాడు సుమంతుడు. అతడు సోముడు అనే మరో కాపలాదారు.

మహారాజు ఆంతరంగిక మందిరం బయట కాపలాకాసేవాళ్ళలో అతనొకడు.

దొంగతనం, నమ్మకద్రోహం, రాజద్రోహం నేరాల కింద సోముడికి జీవిత ఖైదుని విధించాడు మహారాజు. పోయిన వజ్రాలు దొరికినందుకు ఎంతో ఆనందించాడు. దొంగని చాకచక్యంగా పట్టుకున్నందుకు సుమంతుడిని అభినందించి, 'ఎలా పట్టు కున్నారు ఇంతకీ దొంగని? మధ్యలో విజ యుడిని ఎందుకు చెరసాలలో ఉంచారు?' ఆసక్తితో ప్రశ్నించాడు.

'దొంగతనం చేసినవాడు ఎవ్వడూ స్థిమి తంగా ఉండలేడు మహారాజా. అందు లోనూ దొంగతనాలు చేయడం అలవాటుగా లేనివాడు. దొంగ గురించి వేట జరుగుతోం దని తెలిసి కంగారుపడుతూ ఉంటాడు. అందుకే దొంగని పట్టుకోవడానికి ప్రత్యేక దళం ఏర్పాటయిందని ప్రకటన చేయిం చాను. మన కాపలాదారులందరిలో సోముడు అనుమానాస్పదంగా కనిపిం చాడు. అయితే వజ్రాలతో సహా దొరికితే తప్ప నేర నిరూపణ చేయలేం కదా.. అందు కని విజయుడిని దొంగగా ముద్ర వేసి చెరసాలలో వేయించాను. హమ్మయ్యా.. అనుకున్న సోముడు వజ్రాల్ని వదిలించు కునే ప్రయత్నాలు చేస్తాడని ఊహించి, అతనిమీద నిఘా ఉంచాను. అనుకున్నట్టే కొలువుకు సెలవుపెట్టిన సోముడు తన ఇంటి పెరట్లో గొయ్యి తీసి పాతిపెట్టిన వజ్రాలని తవ్వి తీసి పొరుగూరులో ఉన్న తన బంధువులింటికి చేరవేయబోతుండగా వలపన్ని పట్టుకున్నాను,' వివరించి చెప్పాడు సుమంతుడు.

అంతా విని, 'శభాష్ మంత్రివర్యా.. శభాష్. ఎంతో తెలివిగా ఎవరినీ నొప్పించ కుండా దొంగని పట్టించినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను,' అన్నాడు చంద్రశేఖ రుడు.

'ఆ అభినందనల్లో కొంత భాగాన్ని నాకు సహకరించిన విజయుడికి, ఇతర సిబ్బందికీ నజరానాల్తో సహా అందించాలి మరి!, నవ్వుతూ అన్నాడు సుమంతుడు.






# చంద్రహారం

ఒక ఊళ్లో దమ్మిడీల గోపయ్య అనే లోభి ఉండేవాడు. సుఖంగా బ్రతకటానికి తగినంత ఉండి కూడా గోపయ్య పేదవాడి లాగా ప్రతి దమ్మిడీ పోగు చేసేవాడు.

ఒకనాడు పొరుగింటి పున్నయ్య తన భార్యకు అయిదు వందలు పెట్టి చంద్రహారం చేయించాడు. పున్నయ్య భార్య ఆ చంద్రహారాన్ని మెళ్లో వేసుకుని ఒకసారి ఊరంతా చుట్టివస్తూ గోపయ్య భార్య సుందరమ్మకు కూడా కనబడి వెళ్ళింది. దానిని చూసి అటువంటి చంద్రహారం తనకు కూడా కొనిపెట్టి తీరాలని సుందరమ్మ పట్టుబట్టింది.

''ఎందుకే, డబ్బు దండగ! కూటికా, గుడ్డకా? అయిదువందలు పెడితే ఎకరం పొలం వస్తుంది, రెండు జతల ఎడ్లు వస్తాయి!'' అని గోపయ్య అన్నాడు.

''పున్నయ్య మనకన్నా ఉన్నవాడు కాడు. మనకు పిల్లాపీచూ లేదుగానీ, వాళ్ళకు నలుగురు పిల్లలు కూడానూ. పున్నయ్య తన భార్యకు చంద్రహారం చేయించి పెట్టాడు. నాకు మీరు ముక్కుపుడకైనా చేయించరు!'' అన్నది సుందరమ్మ.

గోపయ్యకు కోపంవచ్చి పున్నయ్యను తిట్టాడు. కానీ, భార్య అడిగిన చంద్రహారం కొనటానికి మట్టుకు ఒప్పుకోలేదు.

తన మెళ్ళో చంద్రహారం వేసుకుంటే చూసి, భర్త మెత్తపడతాడేమోనని సుందరమ్మ, పున్నయ్య భార్యవద్ద చంద్రహారం ఒకరోజు అరువు తీసుకుని తన మెడలో వేసుకుని, భర్త వద్దకు వచ్చి, 'ఏమండీ, ఎలా ఉంది?' అని అడిగింది.

గోపయ్య తన భార్య మెడకేసి చూసి క్షణంపాటు ఆనందించాడు. కానీ తనను

ఎస్. శోభిని

చంద్రహారం చేయించమంటుదేమోననే భయంతో, 'బాగానే ఉందిగానీ, అంత ఖరీదైన వస్తువు మనకెందుకే? దొంగలు ఎత్తుకుపోగలరు. వేగిరం వెళ్ళి వాళ్ళ నగ వాళ్ళకు ఇచ్చేసిరా!' అన్నాడు.

'బోలెడంత పని ఉంది. రేపుదయం ఇచ్చేస్తాను' అన్నది సుందరమ్మ.

ఆ రాత్రి గడిచిపోయింది. తెల్లవారగానే సుందరమ్మ ఆదుర్దాగా తన భర్త దగ్గిరికి వచ్చి, "ఏమండీ, మీరుగానీ పొరబాటున రాత్రివేళ దొడ్డివాకిలి తలుపు తెరిచి పెట్టారా?' అని అడిగింది. 'లేదే? దొంగలు రాలేదుకద? వాళ్ళ చంద్రహారం ఇచ్చే శావా?' అని గోపయ్య ఆదుర్దా పడ్డాడు.

'చంద్రహారం బొట్టుపెట్టెలో దాచాను లెండి. ఇంట్లో ఏమీ పోయినట్టు లేదు' అంటూ సుందరమ్మ బొట్టుపెట్టె తెరిచి చూసింది. అందులో చంద్రహారం లేదు. సుందరమ్మ శోకాలు ప్రారంభించింది.

'బుద్ధి తక్కువదానా! అంత ఖరీదైన వస్తువు అప్పుడే తిరిగి ఇచ్చుకోరూ? ఇప్పుడు అయిదువందలూ ధారపోసి నగ చేయించి వాళ్ళకు ఇవ్వాలికద!' అన్నాడు.

'మీరు దొడ్డి తలుపు మూయకుండా పెడతారని నేను కలగన్నానా?' అన్నది సుందరమ్మ. 'నేనా తలుపు తెరిచినట్టు నాకు జ్ఞాపకం లేదు,' అన్నాడు భర్త.

ఏమయినా, గోపయ్యకు అయిదు వందలు ఖర్చుచేసి మరో చంద్రహారం చేయించక తప్పింది కాదు. దాన్ని తెచ్చి భార్యకు ఇస్తూ.. 'వేగిరం దీన్ని తీసుకుపోయి పున్నయ్యగారింట్లో ఇచ్చిరా! అయిన శాస్తి చాలు!' అన్నాడు భర్త.

సుందరమ్మ నవ్వుతూ, చంద్రహారం తీసుకుని మెడలోవేసుకుని, 'ఇది బొట్టు పెట్టెలో పెట్టలేదు, చందుగాయి పెట్టెలో పెట్టి పొరబడ్డాను. అది తరువాత కనబడితే ఆ రోజునే దాన్ని పున్నయ్యగారింట ఇచ్చే శాను. కనుక మనం ఏమీ చేయించి ఇవ్వ నవసరం లేదు,' అన్నది.

భార్య గడుసుతనానికి గోపయ్య నివ్వెర పోయి, ఏ మాటా అనలేకపోయాడు.





# శిథిలాలయం - 13

(పూజారి ప్రోత్సాహంతో చెంచు నాయకుడూ, అతడి అనుచరులూ, శిఖిముఖీ వాళ్ళమీద హఠాత్తుగా దాడి చేశారు. విక్రమకేసరి, చెంచునాయకుణ్ణి గుర్రంమీదినుంచి పడగొట్టి, గుర్రాన్ని శిఖిముఖీ, నాగుమల్లులకు ఒప్పచెప్పాడు. చెంచులు గుర్రం మీదినుంచి జారిపడిన నాగుమల్లిని అరణ్యంలోని ఒక పులిబోను దగ్గిరకు తీసుకుపోసాగారు. తరువాత-)

చెంచులు నాగుమల్లిని పులిబోను దగ్గిరకు తీసుకుపోయి, దాని పక్కగా నేలమీద పడుకోబెట్టారు. నాగుమల్లికి ఇంకా స్పృహరాలేదు. చెట్టుమీది నుంచి ఇదంతా చూస్తున్న శిఖిముఖికి ఒక్క క్షణంపాటు, మల్లిని పులి బోనులో ఎరగా పెడతారేమో అన్న భయం కలిగింది.

కానీ, అంతలోనే అతడికి చెంచునాయకుడైన బడే చెంచు అన్న మాటలు గుర్తుకు వచ్చినై. వాడు ఆమెను బందీగా చేసి, ఆమె తండ్రి అయిన సవర గండుపోతు నుంచి ధనం గుంజాలని చూస్తున్నాడు. కానీ, వాడి అనుచరులు మల్లిని పులిబోను దగ్గిర ఎందుకు దించారు?

శిఖిముఖి ఇలా ఆలోచిస్తున్నంతలో, చెంచువాళ్ళల్లో ఒకడు చుట్టూ కలియజూసి, పెద్దగా గొంతెత్తి, 'బూతాలదొరా!' అని కేక పెట్టాడు.

ఉత్తర క్షణంలో పులిబోనుకు వెనకవున్న గుబురు చెట్లల్లోంచి, 'ఎవఁడ్రావాడు? చారల మెకాన్ని బెదరకొడుతున్నావా? నిలువునా పాతేస్తాను! పో అక్కణ్ణించి,' అన్న జవాబు వచ్చింది.

చెంచులు ఆ జవాబుకు బెదిరిపోయి అటు చూసేంతలో చెట్ల కొమ్మల్లోంచి ఊడల సాయంతో, నల్లగా, పొట్టిగా, బక్కచిక్కి ఉన్న వాడొకడు నేలమీదికి దిగాడు. వాడి మెడలో ఎముకల దండ ఒకటి ఉన్నది, చేతిలో వంకర

దాసరి సుబ్రహ్మణ్యం

టింకరగా ఉన్న పొడవాటి కర్ర ఒకటి పట్టుకుని ఉన్నాడు. వాడు చెంచు దయ్యాలపోతు.

దయ్యాలపోతు పులిబోనును సమీపిస్తూనే, నేలమీద పడి వున్న నాగుమల్లికేసి ఆశ్చర్యంగా చూస్తూ, 'ఎవర్రా ఇదీ, దేవతా పిల్లలా ఉంది? ఎందుకిక్కడికి తీసుకొచ్చారు? ఎవరు చంపారు?' అని ప్రశ్నించాడు.

చెంచుల్లో ఒకడు జరిగిందంతా అతడికి చెప్పి, 'బడేదొర ఈ పిల్లని ఆకాశగుహదగ్గిరకు తీసుకురమ్మన్నాడు. కానీ, చాలాసేపుగా కదలకమెదలకపడున్నది. చచ్చిపోయిందేమో అని భయంగా ఉన్నది. దొర ప్రాణాలు తీసేస్తాడు,' అన్నాడు వణికిపోతూ.

భూతాలరాయుడు, నాగుమల్లి ముక్కుపుటాల దగ్గిర వేలుపెట్టి చూసి, 'చావలేదు. ప్రాణం ఉన్నది. గుర్రంమీంచి పడ్డ పాటుకు ప్రాణం కడబట్టింది. మందూ మంత్రంవేసి ఇప్పుడు మెళకువ తెప్పించామో – మీ కంద కుండా పారిపోతుంది. ఇదుగో, ఈ భస్మం తీసుకోండి. ఆకాశ గుహ చేరింతరువాత ముక్కు దగ్గిర పెట్టండి. నాలుగు తుమ్మి లేచి కూచుంటుంది,' అని నడుంనుంచి వేలాడుతున్న సంచిలోంచి, ఒక పొట్లం తీసి చెంచు వాడికి ఇచ్చాడు.

చెంచువాడు ఆ పొట్లం తీసుకుని గొండిన దోపుకుని, రెండోవాణ్ణి హెచ్చరించాడు. ఇద్దరూ కలిసి నాగుమల్లిని తిరిగి భుజాన వేసుకుని బయలుదేరారు. ఇదంతా చూస్తున్న శిఖిముఖికి నాగుమల్లిని వాళ్ళ బారి నుంచి రక్షించటం చాలా తేలిక అన్న ధైర్యం కలిగింది. అతడు నాగుమల్లిని ఎత్తుకు పోతున్న చెంచులను మధ్యమార్గంలో అటకాయించాలనుకున్నాడు.



శిఖిముఖి తన వెంట ఉన్న శబరుడితో తాను తిరిగి వచ్చేవరకూ, చెంచు భూతాలరాయుణ్ణి ఓ కంట కనిపెట్టి ఉండమని చెప్పి, చెట్ల కొమ్మల మీదుగా ముందుకు కొంత దూరం జరిగిపోయేసరికి, గండశిలల దగ్గిర తమను ఎదుర్కొన్న చెంచులు కొందరు, నాగుమల్లిని ఎత్తుకుపోతున్న వాళ్ళను సమీపిస్తుండటం అతడి కంటపడింది.

ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి నిరుత్సాహపడిపోయాడు. ఇందర్ని ఎదిరించి నాగుమల్లిని రక్షించటం సాధ్యమయ్యేది కాదని అతడు నిర్ణయించుకున్నాడు. విక్రమకేసరి వెంట తీసుకువచ్చే శబరుల సహాయంతో, తాను చెంచు నాయకుడి ఆకాశగుహను ముట్టడించటం ఒక్కటే, నాగుమల్లిని రక్షించటానికి మిగిలిన మార్గం...

విక్రమకేసరి వచ్చేవరకూ తాను చేతులు ముడుచుకు కూర్చోవలసిందే అనుకున్నాడు



శిఖిముఖి. అంతలో అతడికి భూతాలరాయుడూ, పులిబోనూ గుర్తుకు వచ్చినై. ఆటవికుల్లో ఒకడుగా అతడికి, అలాంటి జాతి వాళ్ళమీద మంత్రతంత్రాలు ఎరిగిన వ్యక్తులు చలాయించే అధికారం గురించి బాగా తెలుసు. చెంచు భూతాలరాయుణ్ణి కాస్త హడలగొట్టి, వీలయితే అతడి ద్వారా కొంత సహాయం సంపాయించాలనుకున్నాడు శిఖిముఖి. ఆ వెంటనే అతడు నిశ్శబ్దంగా చెట్ల కొమ్మల్లో కదిలి, పులిబోను ఉన్నచోటుకు వచ్చాడు.

భూతాలరాయుడు ఒక చిన్న మేకను, మెడతాడు పట్టుకుని బోను దగ్గిరకు లాక్కురా ప్రయత్నిస్తున్నాడు. కానీ అది అరుస్తూ అటూ, ఇటూ గెంతుతున్నది. శిఖిముఖి కొద్దిసేపు ఇదంతా చూసి, పులిలా పెద్దగా ఒక్కసారి గాండ్రుపెట్టి, చెట్ల కొమ్మల్లోంచి వేగంగా భూతాలరాయుడి ముందు దూకాడు.

భూతాలరాయుడు అదురుకుని కేకపెట్టి పారిపోబోయినవాడల్లా, తనముందు దూకినది పులి కాదనీ, శబర యువకుడనీ చూసి, వంకరకర్ర పైకెత్తుతూ, 'ఎవడ్రా నువ్వూ? చెంచు దయ్యాలపోతుతోనే పరాచకాలా? నిన్ను మారేడుకాయలో దట్టించి ముక్కుపొడుంకింద పీల్చేస్తాను,' అన్నాడు.

శిఖిముఖి ఏమీ మాట్లాడకుండా, ఎడమ చేత్తో అతడి చేతిలోంచి కర్ర లాక్కుని, కుడి చేత్తో అతడి జుట్టు వడిసి పట్టుకున్నాడు. భూతాలరాయుడు పట్టు విడిపించుకునేందుకు పెనుగులాడుతూ, 'ఎవడ్రా నువ్వూ, వెర్రికుంకా! బతుకుమీద రోశావా, ఏం? నేనెవర్ననుకున్నావ్? బడేచెంచు ముఠావాణ్ణి, ఆ చెంచు తరువాత అంతవాణ్ణి, వదులు!' అన్నాడు.

శిఖిముఖి పెద్దగా నవ్వి, 'నువ్వెవడివైతే నాకేం, దయ్యాలపోతూ? ఒక్కమాట చెప్పు; ఈ పక్కనే నీటిమడుగు చూశాను. పులి ఏ వేళప్పుడు దప్పిక తీర్చుకునేందుకు అక్కడికి వస్తుంది?' అని ప్రశ్నించాడు.

భూతాలరాయుడు ఆ ప్రశ్న వింటూనే కళ్ళెర్రజేసి, 'ఎవడ్రా నువ్వు, నన్ను ప్రశ్నలడగటానికి? జుట్టు వదులు ముందు!' అంటూ హుంకరించాడు.

'అయితే నిన్ను ఏం ప్రశ్నలడగను, అంతా ఆ పెద్దపులే చూసుకుంటుంది!' అంటూ శిఖిముఖి, దయ్యాలపోతును నడుంపట్టుకుని పైకెత్తి పులిబోను దగ్గిరకు తీసుకుపోయి, 'మేక బదులు నిన్ను పులికి ఎరగా పెడుతున్నాను, తెలిసిందా?' అంటూ బోనులోకి తోయబోయాడు. భూతాలరాయుడు గడగడా వణికిపోతూ 'నువ్వెవరో తెలియక

దూషించాను, క్షమించు! నన్ను పులికి ఆహా రంగా వెయ్యకు, బతికున్నన్నాళ్ళూ నీకు సేవ చేస్తాను' అంటూ బావురుమన్నాడు. శిఖి ముఖి, అతణ్ణి వదిలి, 'అలా అయితే నిన్ను పెద్దపులికి మేతగా వెయ్యను. బతికున్న న్నాళ్ళూ నాకు సేవ చేయనవసరం లేదు, ఒక్క ఇరవైనాలుగ్గంటలూ నేచెప్పినట్టు చెయ్యి చాలు' అన్నాడు.

'చిత్తం, ఆజ్ఞాపించు, నీ దాసుణ్ణి' అంటూ భూతాలరాయుడు, శిఖిముఖికి ప్రాణాచారం పడిపోయాడు.

శిఖిముఖి అతణ్ణి లేవమని చెప్పి, 'సవర గండుపోతు కూతుర్ని మీ వాళ్ళు బలవం తంగా ఎత్తుకుపోయారు; నువ్వు చూశావు గదా? ఆమెను ఈ రాత్రే నేను కాపాడదలి చాను. ఎలా అని అడక్కు. కానీ, నువ్వొకటి చేయాలి. మీ ఆకాశగుహ ముందుండే గుడి శెల చుట్టూ ఉన్న కంచె ద్వారాన్ని ఈ రాత్రికి తాళ్ళతో లోపలినుంచి బంధించకుండా అట్టే పెట్టాలి. గండుపోతు కూతుర్ని ఆ ద్వారానికి సాధ్యమైనంత దగ్గిరగా ఉన్న గుడిశెలో ఉంచాలి. ఈ పనులు చేయగలవా?' అన్నాడు.

'చిత్తం. నీ ఆజ్ఞ శిరసా వహిస్తాను. చెంచు ముఠాలో నా మాటకు తిరుగు లేదు,' అన్నాడు భూతాలరాయుడు.

'అది నిజమే కావచ్చు. కానీ, నువ్వు అన్న మాట నిలుపుకోకపోతే? నన్ను మోసం చేస్తే?' అని ప్రశ్నించాడు శిఖిముఖి.

'ఆకాశ దేవర మీద ఒట్టేస్తున్నాను, సరా? అంటూ భూతాలరాయుడు మెళ్ళో ఉన్న ఎముకల దండను కళ్ళకద్దుకున్నాడు.

'అలా అయితే ఆ దండను నా దగ్గిర ఇచ్చిపో. నువ్వు చెప్పినట్లు చేస్తే, ఆ తరువాత దాన్ని నీకు తిరిగి ఇచ్చేస్తాను.' అన్నాడు శిఖిముఖి, ఎముకల దండను చేత్తో గట్టిగా పట్టుకుని.



భూతాల రాయుడు లబలబలాడిపోతూ, 'ఈ మహత్తు గల దండలోనే ఉంది, నా మంత్రశక్తంతా! ఇది మెళ్ళో లేకపోతే నేను చిల్లిగవ్వకు మారను. చెంచులంతా నన్ను కొండగబ్బిలానికన్నా హీనంగా చూస్తారు,' అన్నాడు.

'సరే, ఆడినమాట తప్పవుగదా? జాగ్రత్త. మోసం చేయాలని ప్రయత్నించావో, నిన్నేదో ఒకనాడు పట్టుకుని పెద్ద పులికి ఆహారంగా వేస్తాను,' అన్నాడు శిఖిముఖి.

'మూడు కోట్ల కొండదయ్యాలూ, ఆరు కోట్ల అరణ్యభూతాల సాక్షిగా చెబుతున్నాను; నేను అన్నమాట నిలబెట్టుకుంటాను,' అన్నాడు భూతాలరాయుడు.

'అలా అయితే, నువ్వు మీ ఆకాశ గుహకు వెళ్ళిపో. నాగుమల్లికి ఎలాంటి హానీ జరక్కుండా చూడు. ఈ బోను సంగతి నేను చూస్తాలే,' అన్నాడు శిఖిముఖి.

'చిత్తం, అలాగే ఉండిపోతాను. అసలు నేను ఎక్కువగా ఉండేది ఈ అరణ్యంలోనే. ఆ కనబడే మాను వెనుకే నా గుడిశె ఉన్నది. సెలవు,' అంటూ భూతాలరాయుడు అక్కణ్ణించి బయలుదేరాడు.

శిఖిముఖి చెట్టెక్కి భూతాలరాయుడు ఎటు పోతున్నదీ పరీక్షగా చూసి, వాడు ఆకాశ గుహకేసే పోతున్నట్టు తెలుసుకుని, చెట్టు దిగి వచ్చాడు. తరవాత అతడు మేకను బోనులో కట్టివేసి, అంతవరకూ రహస్యంగా చెట్టుమీద ఉన్న శబరుణ్ణి కేకవేశాడు. వాడు చెట్టుదిగి రాగానే, శిఖిముఖి వాణ్ణి వెంటబెట్టుకుని, భూతాలరాయుడు చెప్పిన గుడిశెలో ఏమున్నదో చూసేందుకు వెళ్ళాడు.

గుడిశెలో శిఖిముఖికి కొన్ని పులితోళ్ళూ,




ఎలుగు చర్మాలూ గోడకు వేళ్ళాడుతూ కనిపించినై. నడిమింటి గుంజకు ఉన్న కొయ్యమేకులకు కొన్ని కపాలాలు తగిలించబడి ఉన్నాయి. శిఖిముఖి వాటిని పరీక్షించి చూసి, ఒక పులితోలునూ, ఒక కపాలాన్నీ తీసుకున్నాడు. రాత్రికి చెంచుముఠా ఉండే ప్రాంతానికి వెళ్ళినప్పుడు, వాటితో కొంత అవసరం కలుగవచ్చన్న ఆలోచన అతడిక్కలిగింది.

సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా విక్రమకేసరి యాభై అరవైమంది అనుచరులతో శిఖిముఖి ఉన్న చోటుకు వచ్చాడు. వాళ్ళల్లో సవరలూ, శబరలూ కూడా ఉన్నారు. శిఖిముఖి, విక్రమకేసరికి అతడు లేని సమయంలో జరిగినదంతా చెప్పి, 'ఆ దయ్యాల పోతు అన్నమాట నిలబెట్టుకుంటాడన్న పూర్తి నమ్మకం నాకున్నది. అందువల్ల మనం అయిదారుగురం రాత్రికి వాళ్ళ గుడిసెల్లో జొరబడి నాగుమల్లిని విడిపించుకు రావచ్చు. అలా

కాక మనం గుంపుగా వెళ్ళి వాళ్ళమీద దాడి చేస్తే, అనవసర రక్తపాతమే కాక, కోపంకొద్దీ చెంచులు నాగుమల్లికేదైనా హాని కలిగించ వచ్చు,' అన్నాడు.

'ఈ ఆలోచన బావుంది. ఒకటి మాత్రం మరిచిపోకు. మన ప్రధాన శత్రువు శిథిలా లయ పూజారి! వాడే ఈ దుర్మార్గాలకన్నిటికీ కారకుడు. వాడి సంగతే నీవు మరచినట్టు న్నది,' అన్నాడు విక్రమకేసరి.

'వాణ్ణి పట్టుకునే ప్రయత్నంలోనేగదా, మనం ఈ చిక్కుల్లో పడింది. వాణ్ణెలా మరు స్తాను? వాడీ రాత్రి కంటబడ్డాడో నూకలు చెల్లినవాడికిందే లెక్క!' అన్నాడు శిఖిముఖి పళ్ళు కొరుకుతూ.

ఆ తరవాత వాళ్ళిద్దరూ కొంతసేపు సంప్ర దింపులు జరిపి, మొత్తం అనుచరుల్ని వెంట బెట్టుకుని ఆకాశగుహప్రాంతానికి వెళ్ళేట్టూ, అక్కడికి చేరింతరువాత ఒక పదిమందితో మాత్రం ముందుగా చెంచుల గుడిశెల దగ్గి రకు పోయి, పరిస్థితుల్ని బట్టి అవసరం అయితే తతిమ్మా వాళ్ళ సహాయం కూడా తీసుకునేట్టూ నిర్ణయించుకున్నారు.

సూర్యాస్తమయం అవగానే అందరూ అరణ్య మార్గాన చెంచుల నాయకుడుండే కొండ ప్రాంతానికి బయలుదేరారు. ఒక పావుగంట కాలం గడిచేసరికి వాళ్ళకు వెనక వైపునుంచి పులి పెద్దగా గాండ్రించిన ధ్వని వినబడింది.

ఆ ధ్వని వింటూనే అందరికన్నా ముందు నడుస్తున్న శిఖిముఖి ఆగి, 'దయ్యాలపోతు పెట్టిన బోనులో పెద్దపులి పడినట్టుంది. మీలో అయిదారుగురు పోయి బోనుతో సహా దాన్ని లాక్కురండి. అవకాశం దొరికితే చెంచుల్ని కొండమీది నుంచి కింది లోయల్లోకి గెంతిద్దాం,' అని చెప్పాడు.

శిఖిముఖి ఇలా చెప్పగానే, పదీ పన్నెండు మంది శబరులు వెనుదిరిగి బోను దగ్గిరకు పరిగెత్తారు. అతడు ఊహించినట్టు పెద్దపులి బోనులో చిక్కుకుని, బయటపడే మార్గంలేక పెద్దగా అరుస్తూ నానా హంగామా చేస్తున్నది. చిన్న కొయ్య చక్రాలమీద కట్టిన ఆ బోనును శబరులు తాళ్ళ సహాయంతో, శిఖిముఖి ఉన్న చోటుకు ఈడ్చుకుపోసాగారు.

(ఇంకా వుంది)






# చిదంబర రహస్యం

ఒకరోజు మహాత్మాగాంధీ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు సుబ్బారావు తన కార్యాలయగదిలో పాఠశాలకి సంబంధించిన బిల్లులు, రికార్డులు పరిశీలిస్తూ విద్యుత్ బిల్లును చూసి 'కార్యదర్శిగారూ! గత నెల కంటే ఈ నెలలో ఇంత పెద్ద మొత్తంలో విద్యుత్ బిల్లు వచ్చింది. దీనికి కారణం ఏమిటి?' అని అడిగాడు విచారంగా.

కార్యదర్శి సుబ్రమణ్యం మౌనంగా తలూపారేగానీ ఆయనకీ ఏం చెయ్యాలో అంతుబట్టలేదు. అయినా ఎలాగయినా ఒకరెండు రోజులపాటు ఈ విషయం మీద దృష్టి పెట్టి పరిశోధించాలనుకున్నారు.

అందుకే ఆరోజు సాయంత్రం బడిగంట కొట్టగానే పిల్లలందరూ వెళ్ళిన తర్వాత అన్ని తరగతి గదులను పరిశీలించసాగాడు. అలా పరిశీలిస్తున్న సమయంలో, ఆ ఏడు కొత్తగా పాఠశాలలో చేరిన జయంత్ అనే పదేళ్ల ఓ పొట్టి విద్యార్థి ప్రతి తరగతిగదిలోకి వెళ్లి ఫ్యాన్, ట్యూబ్‌లైట్ స్విచ్‌లను ఆపడానికి ప్రయత్నిస్తూ అవి అందక అవస్థపడుతూ ఉన్నాడు.

మళ్లీ కొద్దిసేపు ఆలోచించి, మాస్టారుగారి బల్లను స్విచ్ బోర్డు దగ్గరకు జరుపుకుని వాటిని ఆపి విజయగర్వంతో నవ్వుకుంటూ ఒక నోట్‌బుక్‌లో రాస్తూ, చేతివేళ్లతో ఏవో లెక్కలు వేసుకుంటూ పాఠశాల భవనంలోని పదిహేను గదులలోని ట్యూబ్‌లైట్‌లు, ఫ్యాన్‌ల స్విచ్‌లు అలాగే ఆఫ్ చేసి వెళ్లిపోతూ కార్యదర్శిని చూసి గతుక్కుమన్నాడు.

'బడిగంట కొట్టారు కదా! ఇంటికి వెళ్ళకుండా ఇక్కడ ఏం చేస్తున్నావు బాబూ!' తాను ఏమీ గమనించనట్టే జయంత్‌ని అడిగాడు కార్యదర్శి.

పి.వి. శేషారత్నం

'ఈరోజు ఉదయం ఓ చిన్న పనిమీద ప్రధానోపాధ్యాయులుగారిని కలవాలని ఆయన కార్యాలయానికి రాబోతూ మీ సంభాషణ విన్నాను సార్! ఎక్కడో విద్యుత్ వృధా అవుతోందని అనిపించింది. వెంటనే నాకు మానాన్నగారు గుర్తుకొచ్చారు.

మా ఇంట్లో ఎవరయినాగానీ గది బయటకు వచ్చేముందు లైటు, ఫ్యాన్‌స్విచ్‌లను ఆపకపోతే మా నాన్నగారు వారంరోజుల పాటు వాళ్లతో మాట్లాడరు. అదే మాకు శిక్ష.

అందుకే ఇంట్లోనే కాదు. ఎక్కడ విద్యుత్ వృధా అయినా నేను సహించలేను. మా నాన్నగారే నాకు స్ఫూర్తి.

అందుకే ఇవాళ పాఠశాల అయ్యాక చూద్దునుగదా అన్ని తరగతి గదులలోనూ లైట్లు వెలుగుతున్నాయి. ఫ్యాన్‌లు తిరుగుతున్నాయి. అందుకే వాటిని ఆఫ్ చేసుకుంటూ వస్తున్నాను' అన్నాడు జయంత్.

'మరి ఆ నోట్‌పుస్తకంలో ఏం రాస్తున్నావు? అడిగాడు కార్యదర్శి.

'సార్! రోజూ ఎంత విద్యుత్ వృధా అవుతోందో రాస్తున్నాను. మా ఇంట్లో మా నాన్నగారు ఇలాగే లెక్కలు వేస్తారు. అందుకే మన స్కూల్లో కూడా నేను లెక్కలు వేస్తున్నాను.

మన తరగతి గదులలోని 15 ట్యూబ్ లైట్లకి ఒక గంటకి ఒక యూనిట్ చొప్పున, 15 ఫ్యాన్లకి రెండు యూనిట్ల చొప్పున మర్నాడు మళ్లీ తరగతులు ప్రారంభమయ్యేవరకూ.. అన్ని గంటలపాటు ఇలాగే లైట్లు వెలుగుతూ, ఫ్యాన్లు తిరుగుతూ ఉంటే మన పాఠశాలలో ఎంత విద్యుత్ వృధా అవుతోందో.. లెక్కలు వేస్తున్నాను ఇదిగో చూడండి..' అంటూ ఆ లెక్కల వివరాలు చూపించాడు జయంత్. ఆ



కుర్రాడు చెప్పిన లెక్కలకి కార్యదర్శికి కళ్లు తిరిగాయి. పాఠశాలకు విద్యుత్ బిల్లు ఎందుకు ఎక్కువ వస్తోందో ఆ చిదంబర రహస్యం కాస్తా పూర్తిగా అర్థమయ్యింది.

తర్వాత జయంత్ ఆయనకు నమస్కరించి ఇంటికి వెళ్లిపోయాడు.

అయితే ఇందులో తప్పెవరిది? ఎవరిని శిక్షించాలి? ఈ వృధాను అరికట్టడమెలా? అనే విషయాలను ప్రధానోపాధ్యాయుడితో కలసి చర్చించాడు. దీనికి వారిరువురూ ఒక పరిష్కారం ఆలోచించారు.

మర్నాడు ఉదయం పాఠశాల ప్రార్థనా సమావేశంలో జయంత్‌ను ప్రధానోపాధ్యాయులు వేదిక మీదికి పిలిచి, ఆ విద్యార్థి తన పాఠశాల గదుల్లో వృధా అవుతున్న విద్యుత్‌ను ఎలా ఆదా చేశాడో అందరికీ చెప్పి అందుకు ప్రశంసించి ఓ పుష్ప గుచ్ఛంతోపాటు మంచి కథల పుస్తకాన్ని అతనికి బహుమతిగా ఇచ్చాడు.

ఎంతో గంభీరంగా ఉండే ప్రధానోపాధ్యాయుణ్ణి మెప్పించి, బహుమతి పొందినందుకు గురువులతో బాటు తోటి విద్యార్థులు కూడా జయంత్‌ను అభినందించారు.

ఆరోజు సాయంత్రం బడిగంట కొట్టాక ప్రధానోపాధ్యాయుడు, కార్యదర్శి పాఠశాలంతా కలియదిరిగారు. ఆశ్చర్యం! ఒక్క గదిలో కూడా లైటు వెలగడం లేదు. ఫ్యాన్ తిరగడం లేదు. తక్కిన పిల్లలంతా పోటీపడి వాటిని ఆపి వెళ్తున్నారని ఇద్దరికీ అర్థమయి గుంభనంగా నవ్వుకున్నారు.

పిల్లలూ! జయంత్ కారణంగా నెలనెలా భారీ విద్యుత్ బిల్లు తప్పినందుకు పాఠశాల యాజమాన్యమే కాదు.. నిత్య జీవితంలో ప్రధాన శక్తి వనరు అయిన విద్యుత్ ఆదాకు పాఠశాల పిల్లల్లో స్ఫూర్తి కలిగించినందుకు ఆ ఏడాది జయంత్‌కు గ్రీన్‌కార్ప్స్ వారు కూడా చక్కని బహుమతి ఇచ్చారు తెలుసా?

ఎందుకంటే ఈ భూమ్మీద బ్రతకడానికి శక్తి కావాలి. శక్తిని ఒక రూపంనుంచి ఇంకో రూపంలోకి పునరుద్ధరించుకోగలం తప్ప కొత్తగా మనం శక్తిని సృష్టించలేం, అర్థమయ్యిందా?



# అంకురోద్గమ

## బాలవాణి


Ms. Reshma Umarpasia Sheikh from Chandrapur, Maharashtra of the Deepshikha Adolescent Girls' Club and is holding a copy of the State of the World's Chidlren Report 2011.

ప్రియమైన చిన్నారులకు,

ఒరిస్సా రాష్ట్రంలోని పిల్లల జీవితాలపై ప్రభావం చూపే సమస్యలను ప్రస్తావిస్తున్న కొన్ని కథనాలను మీకోసం తీసుకువస్తున్నాము. UNICEF ఇటీవలే విడుదల చేసిన తన కీలక నివేదిక 'ప్రపంచ పిల్లల స్థితిగతులపై నివేదిక 2011'ని మీతో పంచుకోవాలని అనుకుంటున్నాను. కౌమార్యదశలోని పిల్లలు (10-19 సంవత్సరాలు) సంఖ్య రీత్యా ప్రపంచంలోకెల్లా భారతదేశంలోనే అత్యధికంగా ఉన్నారని మీకు తెలుసు. వీరు మన దేశ జనాభాలో దాదాపు 20 శాతంగా ఉన్నారు. ఈ సంవత్సరం నివేదిక ఈ అంశంపై ఆధారపడింది: కౌమార్యం: అవకాశాల యుగం.

ఈ అంశంపై మీ అభిప్రాయాలకోసం ఎదురు చూస్తున్నాము. - మీ దీదీ

## మా విద్య

మా పాఠశాల పేరు దారా సబులార్ సేవాశ్రమ్. మా పాఠశాలలో అయిదు తరగతులకూ కలిపి ఒకే ఒక ఉపాధ్యాయుడు ఉన్నారు. దీంతో అన్ని తరగతుల విద్యార్థులు చదువుకోవడం కష్టంగా మారింది. మా పాఠశాలకు కొత్త పుస్తకాలు ఇప్పటికీ రాకపోవడంతో మేము పాత పుస్తకాలతోనే సర్దుకోవాల్సివస్తోంది లేదా పలకలపై రాత నేర్చుకోవలసి వస్తోంది. మరొక సమస్య ఏమిటంటే, పాఠశాలలో మొత్తం ఐదు తరగతులు ఉండగా విద్యార్థులకు రెండు తరగతి గదులు మాత్రమే ఉంటున్నాయి. అందరూ ఒకే తరగతిలోనే కూర్చోవలసి రావడంతో పిల్లలు చేసే శబ్దం మరీ


Education creates awareness about the environment
- Anil Behera, Kundra Block

ఎక్కువగా ఉంటోంది. దీంతో మేము మా చదువులపై దృష్టి పెట్టలేకపోతున్నాము. మా పాఠశాలను చుట్టుముట్టిన సమస్యలు తొలగిపోతే మేం చాలా సంతోషిస్తాము.

– పూజా టక్రి, నందపూర్ మండలం

దశమంతపూర్ ప్రాంతంలోని గిరిజనుల ఆర్థిక స్థితి దయనీయంగా ఉంది. ఫలితంగా, ఈ ప్రాంతాలకు చెందిన పిల్లలు 12వ తరగతి లేదా మెట్రిక్యులేషన్ మాత్రమే చదువగలుగుతున్నారు. తర్వాత వారు ఉన్నత చదువులను చేపట్టలేకపోతున్నారు. అయితే ప్రస్తుతం దశమంతపూర్ ప్రాంతానికి ఒక వృత్తివిద్యా సంస్థ రానుంది. దీంట్లో రెండు కంప్యూటర్ కేంద్రాలు మరియు ఒక నైపుణ్య నిర్మాణ కేంద్రం ఉంటున్నాయి. మా ప్రాంతంలోని విద్యార్థులు వీటి కారణంగా ఉన్నత చదువులు చదవగలుగుతున్నారు. ఇతర మండలాల్లో కూడా ఇలాంటి విద్యాసంస్థలను ప్రారంభించాలని మేము అధికారులకు విన్నవిస్తున్నాము.

– సునీల్ ఖాత్రా, దశమంతపూర్ మండలం

మా పాఠశాలకు విద్యుత్తు లేదు. రాత్రిపూట మరుగుదొడ్డికి వెళ్లాలంటే మాకు చాలా ఇబ్బందిగా ఉంటోంది. రాత్రి పూట చదువుకోవడంలో మాకు అనేక సమస్యలు ఎదురవుతున్నాయి. తరగతి గదుల్లో లైట్లు ఉన్నాయి కాని విద్యుత్తు లేనందున అవి వెలగవు. దీంతో తరగతిలో ఉపాధ్యాయులు బోధించిన పాఠాలను మననం చేసుకోవడం కష్టమవుతోంది. అందుచేత తరగతిలో ఉపాధ్యాయుడు ప్రశ్నలు వేసినప్పుడు మేము సమాధానం ఇవ్వలేకపోతున్నాము. అలాంటి సందర్భాల్లో మాకు చాలా బాధ వేస్తుంటుంది.

– హిరా తడింగిత, నారాయణ్‌పట్నం మండలం

---

# మా ఆరోగ్యం

మాది కోట్పాడ్ మండలం, సర్గిగూడ పంచాయితీలోని పటనగూడ గ్రామం. మా గ్రామంలో 400మందికి పైగా ప్రజలు నివసిస్తున్నారు. మా ఊర్లో ఆసుపత్రి లేకపోవడంతో ఊరి ప్రజలు చాలా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వైద్య అవసరాలకోసం వీరు 17 కిలోమీటర్ల దూరంలో ఉన్న కోట్పాడ్ వైద్య కేంద్రం వద్దకు పోవలసి వస్తోంది.అయితే ఆసుపత్రికి వెళుతుండగా మార్గమధ్యంలోనే అనేకమంది రోగులు కన్నుమూస్తున్నారు. వర్షాకాలంలో ఈ సమస్య మరీ ఎక్కువగా ఉంటోంది.మా ఊర్లో ఆసుపత్రి నిర్మిస్తే నేను ఎంతో సంతోషిస్తాను.

– షైతి జాని, కోట్పాడ్ మండలం

మా కథాపడ గ్రామంలో చాలా మంది ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి బతుకుతున్నారు. వీరు తమ పొలాలను ఆవులు, ఎద్దుల సహాయంతో దున్నుకుంటుంటారు. కాని

వర్షాకాలంలో ఇవి క్రిముల బారిన పడి జబ్బుపడుతుంటాయి. నేటిదాకా మా గ్రామంలో పశు వైద్యశాల లేనందున గ్రామస్తులు పశువులను ఆరుబయట కట్టేసి ఉంచుతారు. దీంతో క్రిములు చనిపోతాయని వారి నమ్మకం. నిజానికి ఇలా వాటిని ఆరుబయట కట్టిపడేస్తే అంటు మరింతగా పెరిగి జంతువులకు ప్రాణాంతక పరిస్థితి ఎదురవుతూ ఉంటుంది.మా గ్రామ పంచాయితీలో పశువైద్యశాలను నిర్మిస్తే మా అందరికీ ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.


Children washing their hands with soap before eating - Bhagaban Khara

– ధనపతి గొలారి, బోయిపరిగూడ మండలం

మా గ్రామంలో పెద్దవాళ్లు తమ పిల్లలకు చిన్నవయస్సులోనే పెళ్లి చేసేస్తుంటారు. పెళ్లయిన సంవత్సరంలోనే బాలికలు పిల్లలను కంటుంటారు.దీంతో తల్లీపిల్లలు ఇరువురూ ఆరోగ్యకరమైన జీవితం గడపలేక పోతున్నారు.మా గ్రామప్రజలను ఈ విషయమై చైతన్య పర్చాలని మా బాలవిలేకరులం పథకం రచించాము.

– కుండారియా చంద్రావతి, నారాయణపట్న మండలం

---

## మీకు తెలుసా?

1. బాలల హక్కుల ప్రకటనపై ఐక్యరాజ్య సమితి సదస్సు ఎప్పుడు జరిగింది?
   (ఎ) 1947 ఆగస్టు 17 (బి) 1950 జనవరి 26
   (సి) 1989 మే 24 (డి) 1999 అక్టోబర్ 29
2. ఈ ప్రకటనలో ఎన్ని ప్రకరణాలు ఉన్నాయి.
   (ఎ) 24 (బి) 54 (సి) 108 (డి) 50
3. పిల్లలు పాలుపంచుకునే హక్కు అంటే ఏమిటి?
   (ఎ) పిల్లలకు సంబంధించిన అన్ని విషయాలపై అతడు లేదా ఆమె స్వేచ్ఛగా తమ స్వంత అభిప్రాయాలను వ్యక్తీకరించవచ్చు, వయసు, పరిణితి ప్రాతిపదికన

పిల్లల అభిప్రాయాలకు విలువ ఇవ్వబడుతుంది. అదనంగా, పిల్లలకు సంబంధించి చర్చలు జరిగే ప్రతి వేదికపైనా పాల్గొనే హక్కు పిల్లలకు ఉంటుంది.

(బి) ప్రతి చిన్నారి తాము కోరినట్లుగా సెలవు తీసుకోవచ్చు, అలాగే పాఠశాలకు వచ్చే సమయాన్ని కూడా అతడు/ఆమె నిర్ణయించుకోవచ్చు.

(సి) ప్రతి చిన్నారి అతడు/ఆమె కోరికమేరకు పాఠశాలలో లేదా ఇంట్లో ఆడుకోవచ్చు.

(డి) ప్రతి చిన్నారి తన సమీపప్రాంతాల్లో జరుగుతున్న ఏ కార్యక్రమాలలో అయినా పాల్గొనవచ్చు, అక్కడ ప్రాధాన్యతను పొందవచ్చు.

4. పిల్లల ప్రధాన హక్కులు ఏవి?

(ఎ) ఆడుకునే హక్కు, పర్యటించే హక్కు, భుజించే హక్కు, చదువుకునే హక్కు.

(బి) నాట్యమాడే హక్కు, బడికి వెళ్లే హక్కు, పాడుకునే హక్కు, వార్తాపత్రిక చదివే హక్కు.

(సి) నిద్రించే హక్కు, పెద్దగా మాట్లాడే హక్కు, కథల పుస్తకాలను చదువుకునే హక్కు, ఇతర ఆరోగ్య సంబంధిత హక్కులు.

(డి) జీవించే హక్కు, అభివృద్ధి చెందే హక్కు, తన్ను తాను కాపాడుకునే హక్కు మరియు పాలుపంచుకునే హక్కు.

---

సమాధానాలు:

1. (సి); 2. (బి); 3. (ఎ); 4 (డి)



**Send us your feedback!**

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Your views on this is very important to us.

Child Reporters,
Sishu Bhavan,
Pujariput, Koraput.
childreporter@gmail.com
www.koraputonline.com
Mobile: 94371 92553



# యక్షుడి నవ్వులు

యక్షస్థలమనే ప్రదేశంలో సోమగిరి అనే రైతు ఉండేవాడు. అతనికి భూవసతీ, పశువులూ ఉండేవి. కానీ అతనిలో కొంత లోభ గుణం ఉండటంచేత పొలాలపనీ, పశువుల పోషణా తానే చూసుకుంటూ, ఉదయం లేచినది మొదలు రాత్రి పొద్దు పోయినదాకా తెగ తిరుగుతూ ఉండేవాడు.

ఒకనాటి ఉదయం సోమగిరి తన పశువుల పని చూసుకుని పొలానికి పోతుండగా దారికి కొంచెం దూరం నుంచి ఎవరో గురక పెట్టుతున్న చప్పుడు వినిపించింది.

సోమగిరి అటుగా వెళ్ళి చూసేసరికి కొన్ని చెట్ల మధ్య చాలా ఎత్తయిన పుట్ట గొడుగూ, దాన్ని ఆనుకుని పడుకుని నిద్ర పోతున్న మరుగుజ్జు మనిషీ కనిపించారు. మరుగుజ్జు ఆకారమూ, పొట్టా, కురచ కాళ్ళూ, కురచ చేతులూ చూసి, అతనొక యక్షుడని సోమగిరి గ్రహించాడు. ఆ ప్రాంతంలో యక్షులను అప్పుడప్పుడూ చూసినవాళ్ళున్నారు.

పూర్వకాలంలో యక్షులు మనుషులతో స్నేహం చేసి, తమకుగల విద్యల సహాయంతో మానవులకు ఎన్నో మేళ్ళు చేసేవారట. ఆ కాలం పోయింది. ఇప్పుడు యక్షులు మానవులు కనబడితే పారిపోతారు.

ఈ నిద్రపోతున్న యక్షుణ్ణి పట్టుకుని నిర్బంధించినట్లయితే వాడి సహాయంతో పెద్ద నిధి సంపాదించుకోవచ్చునని సోమగిరికి తట్టింది. అందుచేత అతను చప్పున వెళ్లి ఆ యక్షుణ్ణి పట్టేసుకున్నాడు.

'నన్నెందుకు పట్టుకున్నావు? వదిలి పెట్టు!' అని యక్షుడు ఒళ్ళు తెలిసి, పెనుగులాడాడు. 'దొరక్క దొరక్క దొరికావు.

కె. సుధ

నాకొక మంచి నిధి నిక్షేపం కావాలి. అది ఎక్కడ దొరుకుతుందో చెప్పినదాకా నిన్ను వదిలిపెట్టను,' అన్నాడు సోమగిరి పట్టిన పట్టు విడవకుండా.

'ధనం ఎక్కడ పాతిపెట్టి ఉంటుందో నాకు తెలియదు. నీకెలా చెప్పేది?' అన్నాడు యక్షుడు అమాయకంగా.

'మంచిగా నువ్వు చెప్పకపోతే నీకు చెయ్యవలసిందేదో నేను చేస్తాను,' అని సోమగిరి యక్షుణ్ణి ఇంటికి తీసుకుపోయి, భోషాణంలో పడేసి, తాళం వేశాడు.

ఒక నెల గడిచింది. ఒకనాడు సోమగిరి అడవి ప్రాంతానికి వెళ్ళి వస్తుండగా ఒక కలపదుంగ దొరికింది. అది అన్ని పక్కలా చెక్కి ఉన్నది.

అది ఆ అడవిలోకి ఎలా వచ్చిందో సోమగిరికి తెలియలేదు. అతడు దాన్ని భుజాని ఎత్తుకుని ఊళ్ళోకి మోసుకొచ్చి, వడ్రంగి శరభయ్యకు అమ్మి, రెండు రూపాయలు తీసుకుని, ఇంటికి వచ్చాడు.

సోమగిరి ఇంట్లోకి అడుగుపెట్టగానే, భోషాణంలో ఉన్న యక్షుడు పకపకా నవ్వటం వినిపించింది. సోమగిరి యక్షుడితో 'నెలరోజులు నిర్బంధంలో ఉంచినా నీకు బుద్ధి రాలేదు. నాకొక నిక్షేపం చూపించి, నీ దారిన వెళ్ళక నీలో నువ్వు నవ్వుకుంటున్నావు. ఎంతకాలం ఇలా భోషాణంలోనే ఉంటావో చూడు,' అన్నాడు కోపంగా.

ఇది జరిగిన కొద్ది రోజులకే సోమగిరి ఇంటికి ఒక దూరపు బంధువు వచ్చాడు. అతడు సోమగిరితో కొంచెం సేపు కబుర్లాడి, మళ్ళీ బయలుదేరాడు. 'భోజనం చేసి పోగూడదా?' అన్నాడు సోమగిరి బంధువుతో.



ఆ బంధువుకు సోమగిరి సంగతి తెలుసు. అందుచేత అతను, 'వద్దులే. పోవలసిన దూరం శానా ఉంది,' అంటూ బయలుదేరాడు.

అతను సోమగిరి ఇల్లు దాటి పది అడుగులు వేశాడో లేదో, పలుపు తెంచుకుని పారిపోతున్న పోట్ల గొడ్డొకటి అతన్ని కుమ్మి పడదోసి, పారిపోయింది. కాలు విరిగిన బంధువును సోమగిరి తన ఇంట్లోకి తెచ్చి నెల రోజులపాటు ఉంచుకోవలసి వచ్చింది. సోమగిరి తన బంధువును ఇంట్లోకి తీసుకొస్తుండగా భోషాణంలో ఉన్న యక్షుడు రెండోసారి వికవికా నవ్వాడు. సోమగిరి విననట్టు ఊరుకున్నాడు.

ఇంకొక నెల గడిచింది. ఒకనాడు, సోమగిరి సంతకు వెళ్ళాడు. అతను తన డబ్బంతా నేలలో ఒకచోట పాతి ఉంచాడు. ఆ కాలంలో డబ్బు జాస్తిగా ఉన్నవాళ్ళందరూ అలాగే చేసేవారు. సోమగిరి డబ్బు పాతిపెట్టిన చోటికి వెళ్ళి, ఎవరూ చూడలేదని నిర్ధారించుకుని కొంత డబ్బు తవ్వి తీసుకుని, మిగతాది మళ్ళీ పూడ్చిపెట్టి, సంతకు వెళ్ళిపోయాడు.

ఇది ఎవడో చాటు నుంచి గమనించి, సోమగిరి వెళ్ళిపోయాక, అక్కడ తవ్వి, పాతిపెట్టిన డబ్బంతా తీసుకుని గుంట జాగ్రత్తగా పూడ్చి, తన దారిన తాను వెళ్ళాడు.

సాయంకాల మయ్యాక సోమగిరి సంతలో కొన్న సరుకులతో సహా ఇంటికి తిరిగి వచ్చేసరికి, భోషాణంలో ఉన్న యక్షుడు పగలబడి నవ్వ నారంభించాడు.

సోమగిరికి చాలా కోపం వచ్చింది. అతను భోషాణపు తాళంచెవి తెచ్చి, భోషాణం తెరిచి, యక్షుణ్ణి పట్టుకు పైకిలాగి, 'రెండు



నెలలుగా నిన్ను నిర్బంధంలో ఉంచినా నువ్వు నాకు ఉపకారం చెయ్యకపోగా విరగబడి నవ్వావు. ఇప్పటికి మూడుసార్లు నవ్వావు. నీ నవ్వుకు కారణం చెప్పకపో యావో, నిన్ను గొంతు పిసికి చంపేస్తాను. చెప్పు, నీ నవ్వులకు కారణమేమిటి?,' అని అడిగాడు.

'ఒకరోజు నీకొక చెక్కిన దుంగ దొరికింది. దాన్ని నువ్వు శరభయ్యకు రెండు రూపా యలకు అమ్మావు. వట్టి మందమతివి కావటంచేత అందులో లక్షలకు విలువైన బంగారమూ, రత్నాలూ ఉన్నట్టు తెలుసు కోలేకపోయావు. శరభయ్య వాటిని తీసు కుని, లక్షాధికారి అయి, హాయిగా బ్రతుకు తున్నాడు. నీ మందబుద్ధి చూస్తే నాకు నవ్వొచ్చింది,' అన్నాడు యక్షుడు.

సోమగిరికి ఈ మాట వినేసరికి మతి పోయినట్టయింది. 'రెండోసారి మా బంధువు కాలు విరిగినప్పుడు ఎందుకు నవ్వావు?' అని అతను యక్షుణ్ణి అడిగాడు.

'నీ తెలివి తక్కువకే నవ్వాను. రాక రాక వచ్చిన బంధువుకు భోజనం పెట్టి పంపి నట్టయితే అతనికి ఆ అపాయం తప్పేది. నువ్వతని భారం నెల రోజులు మోసే అవ సరం ఉండేది కాదు,' అన్నాడు యక్షుడు.

'మరి ఇప్పుడెందుకు నవ్వుతున్నావు?' అన్నాడు సోమగిరి విచారంగా.

'ఎందుకంటే, నువ్వు పాతిపెట్టిన డబ్బంతా దొంగ కాజేసుకు పోయాడు. నువ్వు పొద్దున అందులో కొంత తవ్వి తీసే టప్పుడు ఆ దొంగ గమనించాడు. అది కూడా నీకు తెలియదు. నీ అంత తెలివి తక్కువ వాడిని నేనెక్కడా ఇంతవరకు చూడలేదు,' అన్నాడు యక్షుడు.

'నా డబ్బంతా పోయిందా?' అని గట్టిగా అరిచి సోమగిరి ఉన్నఫళాన తాను డబ్బు పాతిపెట్టిన చోటికి వెళ్ళాడు. ఒక్క రాగి నాణెం కూడా మిగలకుండా అంతాపో యింది. సోమగిరి ఏడుస్తూ ఇంటికి తిరిగి వచ్చేసరికి యక్షుడు కూడా లేడు.





# పోటీకానుక

పూర్వం ఒక రాజుగారికి ఒక రైతు స్నేహి తుడు ఉండేవాడు. రాజుగారు వేటకు వెళ్లి నప్పుడల్లా, ఈ రైతు ఇంట ఒకపూట ఉండి, చిలగడ దుంపలు కాల్పించుకు తిని, తన నగరానికి వస్తూ ఉండేవాడు.

ఇలా ఉండగా రైతు ఒకనాడు రాజధానికి వెళ్లవలసి వచ్చింది. రైతు భార్య ఒక కట్టెడు చిలగడ దుంపలు మూటగట్టి ఇచ్చి, 'రాజు గారికి చిలగడ దుంపలంటే మహా ఇష్టం! వీటిని తీసుకుపోయి ఆయనకు కానుకగా ఇయ్యి!' అన్నది.

'ఓసి పిచ్చిదానా, రాజుగారు ఇటువంటి కానుకలను చూసి ఏమనుకుంటారు?' అన్నాడు రైతు తన భార్యతో.

'ఇంతదూరం నుంచి నువ్వు తీసుకుపో యినందుకు వారు తినకపోతారా ఏమిటి? ఫరవాలేదులే! ఏమీ అనుకోరు, పట్టుకెళ్లు!' అన్నది రైతు భార్య. భార్య మాట ఎందుకు తీసెయ్యాలని రైతు చిలగడ దుంపల మూట ఎత్తుకుని రాజధానికి బయలుదే రాడు.

దారిలో ఇతడు తన మూటలో నుంచి చిన్న చిన్న దుంపలు ఏరి కొరికి తింటూ నడవసాగాడు.

తీరా అతడు రాజధానికి చేరేసరికి మూటలో ఒకే ఒక చిలగడదుంప బాగా పెద్దది మిగిలింది.

'దీనిని రాజుగారికి ఇస్తాను. ఆయన ఎన్నడూ ఇంత పెద్ద దుంప చూసి ఉండడు!' అనుకున్నాడు రైతు.

రాజుగారి దర్శనం కోసం రైతు రాజసభ వద్దకు వెళ్ళి తొంగి చూశాడు. లోపల సభ జరుగుతున్నది. రైతు బయట నిలబడ్డాడు. కొంతసేపటికి ముగిసింది. రాజుగారు బయ

ఎస్. వెంకటరమణ

టకి వచ్చి తన స్నేహితుడైన రైతును చూసి పలకరించి, కుశల ప్రశ్నలువేశాడు. రైతు మూటలోనుంచి చిలగడ దుంప తీసి, 'తమకోసం తెచ్చాను!' అన్నాడు.

రాజు పరమానందంతో చిలగడ దుంపను తీసుకుని, పక్కన ఉన్న భటుణ్ణి పిలిచి 'ఒరే, ఈ బహుమానాన్ని మన ఖజానాలో భద్రం చేయించు. తరవాత కోశాధికారినడిగి వెయ్యి మొహరీలు ఇచ్చి ఈ రైతుకు బహుమానంగా ఇయ్యి,!' అన్నాడు.

తరవాత రాజుగారు రైతు కేసి తిరిగి, 'మనం భోజనానికి పోదాం పద!' అన్నాడు.

ఎవరో ఊరూ పేరూ లేని రైతొకడు ఒక చిలగడ దుంప తెచ్చి ఇస్తే, రాజుగారు వాడికి వెయ్యి బంగారు మొహరీలు బహుమతి ఇవ్వటమే గాక, తనతో పాటు భోజనం కూడా పెట్టి పంపాడని రాజసభలో ఉండేవారికం దరికీ తెలిసిపోయింది.

రాజుగారు ఇంత దాత అయినప్పుడు లాభం ఎందుకు పొందగూడదనే ఉద్దేశంతో ఒకసభికుడు మర్నాడు ఉత్తమజాతి గుర్రాన్ని ఒకదాన్ని కొని రాజుగారి వద్దకు తెచ్చి, 'మహా రాజా, ఈ మేలుజాతి అశ్వాన్ని తమకు కానుకగా ఇచ్చుకుంటున్నాను. అనుగ్రహిం చండి!' అన్నాడు.

ఒక్క చిలగడదుంపకే వెయ్యి మొహరీ లిచ్చినవాడు ఈ గుర్రానికి ఇంకెంత బహు మతి ఇస్తాడో గదా అని సభికుడు ఆశప డ్డాడు. ఈ సంగతి రాజుగారు గ్రహించాడు. ఆయన తన పక్కనే ఉన్న భటుణ్ణి పిలిచి ఒరే మన ఖజానాలో దాచమని ఒక చిలగడ దుంప పంపాను. 'దాన్ని తీసుకురా!' అని వాడి చెవిలో రహస్యంగా చెప్పాడు.

భటుడు వెళ్ళి త్వరలోనే చిలగడ దుంపతో తిరిగి వచ్చాడు. రాజుగారు ఆ చిలగడదుం పను సభికుడికి ఇస్తూ, 'వెయ్యి మొహరీలు చేసే చిలగడదుంప! నాకు నువ్వు గుర్రం కానుకగా ఇచ్చినందుకు నేను దీన్ని నీకు బహుమతి చేస్తున్నాను.!' అన్నాడు.

సభికుడి ఆశ నిరాశ అయిపోయింది. అతని దురాశకు తగిన శాస్తి జరిగిందని సభికులు తమలో తాము చెప్పుకున్నారు.






# రంగయ్య రహదారి

రంగరాజపురం చిన్నపల్లెటూరు. పొరుగున ఉన్న కళింగ పట్నానికి నిత్యమూ ఏదో ఒక పనిమీద వెళ్లవలసిన అవసరం ఆ ఊరిలోని ప్రతి కుటుంబానికీ ఉన్నది.

రంగరాజపురానికి, కళింగపట్నానికి మధ్య దూరం రెండు క్రోసుల వరకూ ఉంటుంది. పూర్తిగా గతుకులు, గుంతలమయమైన దారి అది. అందరికీ పట్టణంలో అవసరాలయితే ఉంటవి, కానీ ఎవరూ దారి గురించి పట్టించుకోరు. వీళ్లను పట్నానికి చేరవేయడానికి ఉన్న రవాణా సౌకర్యం, ఆ ఊరిలో ఉన్న నాలుగు బాడుగ గుర్రపు బండ్లు.

అందులో మూడు బండ్లు, కాస్త కొత్తగా తళతళలాడుతుంటాయి. లోపల కూర్చోవడానికి బూరుగుదూది మెత్తలుంటాయి. గుర్రాలు కూడ, రంగురంగు ఈకల తురాయిలతో, కళ్లకు నల్లని గంతలతోనూ, పంచకల్యాణీల్లా నిగనిగలాడుతుంటాయి. ముగ్గురు వ్యక్తులు, బతుకు తెరువు మార్గం కోసం వాటిని పట్నంలో కొని తెచ్చి నడుపుకుంటున్నారు. ఇక నాలుగో బండి రంగయ్యది. రంగయ్యకు ఆ బండి అతని తాత దగ్గిర నుండి సంక్రమించింది.

ఈ కొత్త బళ్లు రాక పూర్వం రంగయ్య గుర్రపు బండి మరి రెండు ఎడ్లబళ్లు బాడుగకు తిరుగుతుండేవి. కొత్త గుర్రపు బగ్గీలు వచ్చాక, ఎడ్లబళ్లకూ, రంగయ్య బండికీ గిరాకీలు పడిపోయాయి. ఎడ్ల బళ్ల వాళ్లయితే ఏకంగా ఎడ్లను అమ్మేసి మరో వృత్తి చూసుకున్నారు. బండి తోలడం తప్ప మరొక పని చేతకాని రంగయ్య మాత్రం ఆ పాత బండినే పెట్టుకుని కాలం గడుపుతున్నాడు.

అదీగాక, ఈ మధ్య రంగయ్య గుర్రానికి వీపున ఓ రాచకురుపు లేచింది. రంగయ్య

గవ్వల నిర్మలాదేవి

తనకు తెలిసిన గచ్చాకు పుచ్చాకు వైద్యం చేసి చూశాడు. గుణం కనిపించలేదు. పశువుల వైద్యుడికి చూపించాలంటే రంగయ్య వద్ద డబ్బు లేదు. మిగిలిన బళ్లు సవారీ మీద వెళ్లి నప్పుడు అత్యవసర పరిస్థితిలో మాత్రమే రంగయ్యబండి ఎక్కుతుంటారు. అలాట ప్పుడు రంగయ్య కుటుంబానికి తిండి, గుర్రానికి నాలుగు గడ్డి పరకలూ దొరికేవి.

రంగయ్య గుర్రం రోగిష్టిదయినా, బండి పాతదయినా, ఆ గతుకుల దారిలో ఇంత వరకూ పట్టు తప్పి పడ్డది లేదు. బండిని ఒడుపుగా నడపడంలో రంగయ్య దిట్ట. కొత్త బళ్లు మాత్రం వారానికోసారయినా ఆ దారిలో బోల్తా కొట్టడం, ప్రయాణీకులు కొద్దో గొప్పో దెబ్బలు తగిలించుకోవడం పరిపాటయిపో యింది. ఆరోజు కూడా రంగయ్య తన బండిని తీసుకుని వచ్చి, సవారీ కోసం వేచి చూడసాగాడు. ఇంతలో ఒక ధనిక వ్యక్తి హడావుడిగా రంగయ్య బండి దగ్గరకు వచ్చి, 'పట్నం వెళ్లాలి సవారీ వస్తావా?' అని ప్రశ్నిం చాడు. మిగిలిన బళ్లవాళ్లు అతనిని చుట్టు ముట్టి తమ బండి ఎక్కాలంటూ పోటీపడి అడగసాగారు. ఆ వ్యక్తి వాళ్లతో వద్దని చేత్తో సైగ చేస్తూ, రంగయ్య బండి ఎక్కి కూర్చున్నాడు.

కొద్దిదూరం వెళ్లాక రంగయ్య బండి ఎక్కిన ఆవ్యక్తితో, 'అయ్యా, తమరు ఊరికి కొత్తలా ఉన్నారు. ఏదైనా కొత్త బండిలో వెళ్లవలసింది. నా బండిలో సౌకర్యంగా ఉన్నదో లేదో?' అన్నాడు నసుగుతూ.

అందుకు ఆయన, 'ఏం కొత్త బళ్లయ్యా బాబూ. సొగసుగా ఉందని, నిన్న ఇలాంటి



బండిలోనే వచ్చాను. గతుకుల్లో కుదుపులకు వళ్లు హూనమయింది నిన్న మా బంధువు ఒకరిని చూడవచ్చాను.' అని కాస్త ఆగి, 'ఇందాకటి నుండి నువ్వు బండి నడపడం చూస్తున్నాను. ఇంత కూడా కుదుపన్నది కన పడ్డం లేదు. నీ బండిలో గడ్డిపరిచిన గోతం బొంతే చాలా సౌఖ్యంగా ఉన్నది. నీ గుర్రం కూడా వీపు మీద అంత పెద్ద కురుపున్నా, చక్కగా స్వారీ చేస్తున్నది,' అని ఆశ్చర్యం వ్యక్తపరిచాడు.

రంగయ్య ఆయనతో భారంగా ఇలా అన్నాడు, 'అయ్యా, ఈ దారి మా తాతలకాలం నుండి ఇలాగే ఉన్నది. నాకు తోలడం బాగా అలవాటయిపోయింది. కొత్త బళ్లవాళ్లకు ఆ సులువు తెలియదు. ఆ కారణంగా కింద పడుతూ ప్రయాణీకులను ఇబ్బందులకు లోను చేస్తున్నారు.ఎంతో కాలం నుండి ఈ



దారిని బాగు చేసే నాథుడే లేడు. ఊరూ అంతంత మాత్రంగానే ఉన్నదీ. ముందు దారి బాగుపడితే తక్కినవన్నీ సమకూరి, ఊరు ఎదుగుతుందని నా అభిప్రాయం. మీరు గొప్ప మనసున్న వారిలా కనిపిస్తున్నారు. దయచేసి ఈ దారి బాగు పడటానికి ఏమైనా చేసి పుణ్యం కట్టుకోండి.'

రంగయ్య మాటలకు ఆ వ్యక్తి చలించి పోతూ, 'నీ పేరేంటో తెలియదు. కానీ నీదెంత మంచి మనసు. నీ పరిస్థితి ఇంత హీనంగా ఉన్నా కూడా పట్టించుకోక, ఊరి బాగు కోసం బాధపడుతున్నావు. ప్రతి ఒక్కరు తమ గురించి కాక, ఎదుటి వారి బాగు గురించి ఆలోచిస్తే, దేశం బాగుపడుతుంది. నా చేతన యిన సాయం చేస్తాను,' అన్నాడు.

ఇంతలో పట్నం వచ్చింది. ఆయన బండి దిగి, రంగయ్య చేతిలో వందరూపాయలు ఉంచి, 'ముందు నీ గుర్రానికి వైద్యం చేయించు. త్వరలోనే మళ్ళీ కలుస్తాను,' అంటూ వెళ్ళిపోయాడు. రంగయ్య నోరు వెళ్ల బెట్టేశాడు. ఆ వ్యక్తి బండి దిగి అటు వెళ్లి పోతూనే, ఇద్దరు వ్యక్తులు హడావుడిగా రంగయ్య బండి దగ్గరకొచ్చి, 'రంగయ్యా, కాస్త బండి ఎక్కించుకుని ఊర్లో దించుదూ!' అన్నారు. వాళ్లు ఇంతకు ముందు రంగయ్య బండి ఎక్కడానికి చీదరించుకున్న తన ఊరి వాళ్లే, రంగయ్య వారితో, 'తమ బోంట్లకు నా బండి తగదు. మరో బండి చూసుకోండి,' అన్నాడు నిష్ఠూరంగా.

అందుకు వాళ్లు, 'అంతటి గొప్ప మనిషే నీ బండి ఎక్కగా లేనిది మేమనగా ఎంత?' అని రంగయ్యతో బండి ఆపించి ఎక్కి కూర్చు న్నారు. 'ఏమిటి, మీరు అంటున్నది,' అని అడిగాడు రంగయ్య. అందుకు వాళ్లు, 'అతడు రాజుగారి ఆస్థానంలో పనిచేసే ఒక ఉద్యోగి. అంత గొప్ప వ్యక్తి సాదా సీదా వాడిలా నీ బండి ఎక్కి రావడం, నీ అదృష్టమే, నీ పరిస్థితి చెప్పు కుని సాయం అడగవలసింది,' అన్నారు.

'అలాగా, అడిగానండి, సహాయం చేస్తా నని మాటిచ్చారు,' అన్నాడు రంగయ్య సంతో షంగా. 'ఇంకేం, నీ రొట్టె విరిగి నేతిలో పడ్డట్టే,' అని వాళ్లు ఊరు రావడంతో రంగయ్యకు బాడుగ డబ్బు మామూలు కంటే ఎక్కువ ఇచ్చి వెళ్లిపోయారు.

ఆరోజు నుండి రంగయ్య దశ కూడా మారింది. ముందు గుర్రానికి వైద్యం చేయిం చాడు. వైద్యుడు ఇచ్చిన మూడు మోతాదుల మందుతో గుర్రపు కురుపు మచ్చకూడా

లేకుండా మాయమయింది. గుర్రానికి సమృద్ధిగా దాణా కొన్నాడు. క్రమంగా రంగయ్య బండికి కూడా గిరాకీలు బాగా రాసాగినయి. బండికి కూడా మరమ్మతులు చేయించి, కొత్త హంగులు కొన్ని జత చేశాడు.

ఒకరోజు సవారీ మీద పట్నం వెళుతున్న రంగయ్యకు దారంతా మనుష్యులతో హంగామాగా కనిపించింది. బళ్లకొద్దీ మట్టి, గులక రాళ్లు, కుప్పలు పోస్తూ, కొందరు, కొలతలు తీసుకుంటూ కొందరు హడావుడిగా కనిపించారు. రంగయ్య బండిని ఒక ప్రక్కగా ఆపి, చూడసాగాడు. ఇంతలో ఆరోజు రంగయ్య బండి ఎక్కివచ్చిన వ్యక్తి అల్లంత దూరంలో ఉండి ఎవరికో సూచనలు ఇస్తూ కనిపించాడు. రంగయ్య చప్పున ఆ వ్యక్తిని సమీపించి, 'దండాలు, బాబుగారూ,' అంటూ నమస్కరించాడు. అతడు తల ఊపి రంగయ్యను చూసి, 'ఆ రోజు నీపేరడగటం మరిచిపోయానయ్యా, తర్వాత విచారించి తెలుసుకున్నానులే, అదలా ఉంచు, ఇప్పుడెలా ఉన్నావు రంగయ్యా,' అంటూ పలకరించాడు.

అందుకు రంగయ్య, 'మీ దయవలన బాగున్నాను. మీరు నా మాట మరువకుండా, దారి మరమ్మతులు చేయిస్తున్నట్లున్నారు. చాలా సంతోషం బాబూ,' అన్నాడు ఆనందంతో.

అందుకు ఆవ్యక్తి, 'నువ్వు చేసిన దాని ముందు, ఇదెంత? నీవెంత దీన పరిస్థితిలో ఉన్నా పట్టించుకోక, మీ ఊరి దారి గురించి మధనపడ్డావు. అందరూ నీలాగా ఎదుటి వారి బాగు గురించి ఆలోచిస్తే ఎంతబాగుంటుంది,' అని కాసేపు ఆగి మళ్లీ, 'నేను రాజు గారి వద్ద రహదారుల శాఖలో పనిచేస్తున్న ఒక ముఖ్య ఉద్యోగిని. నీవు ఈ దారి గురించి, ఊరి వారి ఇక్కట్ల గురించి చెప్పడంతో అర్జీ ఒక్కటి తయారు చేయించి రాజుగారికి సమర్పించాను. వెంటనే రాజుగారు దారి మరమ్మత్తులకు అనుమతి ఇచ్చారు. కొన్నాళ్లకు మీ ఊరికి రహదారి వస్తుంది. ఆ దారికి పేరు కూడా నేనే నిర్ణయించాను. అదేంటో తెలుసా, రంగయ్య రహదారి' అన్నాడు నవ్వుతూ.

రంగయ్యకు ఆనందంతో కళ్లవెంట నీళ్లు తప్ప నోట మాట రాలేదు.





# బంగారు నెమలి

అవంతీ రాజ్యానికి సమీపాన దండకారణ్యం ఉండేది. ఆ అరణ్యానికి ఒక బంగారు నెమలి వచ్చింది. వేటగాళ్లు చాలామంది ఆ బంగారు నెమలిని వలవేసి పట్టడానికి చాలా ప్రయత్నాలు చేశారు. కాని నెమలి శరాబంది అనే బోయవాడి వలలో చిక్కుకుంది.

శరాబంది అంతటితో తన బాధలు తీరిపోయాయని సంతోషించాడు. తనను బంధించి తీసుకు వెళుతున్న శరాబందితో బంగారు నెమలి, 'ఇప్పుడు నన్ను ఏం చేయబోతున్నావు?' అని ప్రశ్నించింది.

ఒక పక్షి మానవ భాషలో తనతో మాట్లాడటంతో మొదట శరాబంది విస్తుపోయాడు. తరవాత 'నీ బంగారు నెమలికన్నులు అమ్ముకుని దరిద్రం నుంచి బయటపడతాను' అని చెప్పాడు. అప్పుడు బంగారు నెమలి, 'నెమలి కన్నులు నీ ప్రాణం. నువ్వు వాటిని తీసిన మరుక్షణం నేను మరణిస్తాను.' అంది.

'నీ ప్రాణంతో నాకేంపని,' అన్నాడు శరబంది నిర్దయగా.

'నీవు ఇంకా ధనవంతుడివి అయ్యే ఉపాయం నేను చెబుతాను. నన్ను మహారాజుకు కానుకగా ఇవ్వు. అతను నీకు విలువైన కానుకలు ఇస్తాడు.' అని చెప్పింది బంగారు నెమలి. ఆ సలహా శరాబందికి నచ్చింది.

బోయవాడు బంగారు నెమలిని అవంతి రాజు చక్రసేనుడికి కానుకగా ఇచ్చాడు. సంతోషించిన మహారాజు, శరాబందికి వెయ్యి బంగారు నాణేలు కానుకగా ఇచ్చాడు.

చక్రసేనుడు, బంగారు నెమలిని పంజరంలో పెట్టమని సేవకులను ఆదేశించాడు అప్పుడా బంగారు నెమలి, 'రాజా నన్ను పంజరంలో బంధిస్తే ఎంతోకాలం బ్రత

ఎన్. శివనాగేశ్వరరావు

కను. అందుకే నన్ను స్వేచ్ఛగా ఉద్యా నవనంలో వదలండి.' అని కోరింది.

'అలా చేస్తే నీవు తప్పించుకుపోతేనో!' అని సందేహం వ్యక్తం చేశాడు చిత్రసేనుడు. 'రాజా! మీరు నాకోసం ధనం వెచ్చించారు. కనుక మీ బానిసను. మీకు ఏదైనా మేలు చేసి రుణం తీర్చేవరకు మిమ్మల్ని వదిలి వెళ్లను. నన్ను నమ్మండి,' అని చెప్పింది.

బంగారు నెమలి మాటలు విశ్వసించిన చక్రసేనుడు, దాన్ని ఉద్యానవనంలో వదిలి మంచిచెడ్డలు చూడమని సేవకులను ఆదే శించాడు. ఉద్యానవనంలో విహరిస్తూ, బంగారు నెమలి అందరికీ కనువిందు చేయసాగింది. అది అందరికీ ఎన్నో నీతులు చెప్పేది. అవి విన్నవారు బంగారు నెమలి తప్పక శాపగ్రస్తురాలైన ఏ దేవకన్యో అయి ఉండాలని భావించేవారు.

ఏడాది తరువాత అవంతి రాజ్యానికి క్షామం వచ్చింది.. ప్రజలు తిండిగింజలు లేక అల్లాడిపోసాగారు. మహారాజుకు ఏం చేయాలో పాలుపోలేదు. బంగారు నెమలితో తన బాధ చెప్పుకున్నాడు.

అప్పుడు బంగారు నెమలి, 'రాజా! బాధ పడవద్దు. మీకు మేలు చేసే అవకాశం ఇప్ప టికి వచ్చింది. నేను అవంతిలో ఏర్పడిన క్షామాన్ని పోగొడతాను' అంది. 'నీవాపని చేస్తే నీకు సంతోషంగా స్వేచ్ఛను ప్రసాదిస్తాను' అన్నాడు చక్రసేనుడు.

'మహారాజా! నేను స్వేచ్ఛగా ఉద్యాన వనంలో నాట్యం చేస్తాను. ఆ నాట్యానికి ప్రకృతి పులకిస్తుంది. వర్షం కురుస్తుంది. పచ్చిక మొలకెత్తుతుంది. చెట్లు చిగురి స్తాయి. పంటలు పండుతాయి. అయితే ఒక షరతు. నేను చేసే నాట్యాన్ని నరులెవరూ



చూడరాదు. అలా జరిగితే నీ ప్రయత్నం ఫలించదు' అని చెప్పింది.

చక్రసేనుడు అందుకు సమ్మతించాడు. మరునాడు అంతఃపురవాసులతో సహా ఏ ఒక్కరూ ఇళ్లనుంచి బయటకు రాకూడదని చాటింపు వేయించాడు.

బంగారు నెమలి, ఉద్యానవనంలో పురి విప్పి నాట్యం చేయడం ప్రారంభించింది. దాని బంగారు కన్నుల ధగధగలు ఆకాశాన్ని తాకాయి. ఆ నాట్యం చూసి పక్షులు కుహు కుహూరావాలు చేశాయి. ప్రకృతిమాత పుల కించింది. కారుమబ్బులు కమ్మి కుంభవృష్టి కురిసింది. ఆ వర్షంలో తడుస్తూ బంగారు నెమలి చాలాసేపటివరకూ నాట్యం చేస్తూనే ఉంది. నెమ్మదిగా అవంతి రాజ్యంలో క్షామ పరిస్థితులు తొలిగి పంటలు పండాయి. ప్రజల బాధలుతీరాయి. చక్రసేనుడు, బంగారు నెమలికి కృతజ్ఞతలు చెప్పుకుని దానికి స్వేచ్ఛను ప్రసాదించాడు.

అప్పుడు బంగారు నెమలి, 'రాజా! మీరు ఒంటరిగా రథారూఢులై వచ్చి నన్ను అర ణ్యంలో వదలండి,' అని కోరింది. చక్రసే నుడు అలానే చేశాడు. అరణ్యం చేరిన బంగారు నెమలి, 'చక్రసేన మహారాజా! మీరు నా మాట విశ్వసించారు. నాకు స్వేచ్ఛను ప్రసాదించి మీమాట నిల బెట్టుకున్నారు. అందుకే ఇంతవరకూ ఏ నరుడూ చూడని నా నాట్యాన్ని మీరు వీక్షించగలిగే వరం ప్రసాదిస్తున్నాను,' అని చెప్పి పురివిప్పి మహారాజు ముందు నాట్యం చేసింది.

ఆ నాట్యానికి చెట్లు పుష్పవర్షం కురి పించి దివ్యపరిమళాన్ని వెదజల్లాయి. గాలి పులకించి మధురమైన సంగీతం వినిపిం చింది. ఆ మనోహర నాట్యానికి చక్రసేనుడు పరవశించిపోయాడు. అతని నేత్రాల నుంచి ఆనందబాష్పాలు రాలాయి. అంతలో బంగారు నెమలి అదృశ్యమైపోయింది.

రాజ్యం చేరిన చక్రసేనుడు అవంతీ రాజ్యానికి బంగారు నెమలి చేసిన సహాయం మరిచిపోలేకపోయాడు. బంగారు నెమలికి ఒకఆలయం కట్టించి నిత్యపూజలు ఏర్పాటు చేసి, తన కృతజ్ఞత చాటుకున్నాడు.



# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 27

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -27 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మే నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జూలై 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మతం



1. పటేటి అంటే ఏమిటి?
2. చిట్టచివరి, ప్రఖ్యాత తీర్థంకరుడి పేరు ఏమిటి?
3. బుద్ధుడు ఏ భాషలో ప్రవచించాడు?
4. శివుడు నటరాజుగా ఏ ఆలయంలో పూజ లందుకుంటున్నాడు?
5. సిక్కుమత నేపథ్యంలో 'పంజి పియారాస్' అని ఎవరిని ప్రస్తావిస్తారు?
6. పార్వతీదేవి వాహనంగా ఉంటున్న జంతువు ఏది?
7. ఎల్లోరా గుహలలో భాగంగా వందేళ్ల కాలం పాటు చిత్రించబడిన హిందూ దేవాలయం పేరు తెలుపండి.

మీకు తెలుసా?

### పెన్సిళ్ళ చరిత్ర



పెన్సిల్ అనే మాట ల్యాటిన్ పెన్సిలస్ (చిన్న తోక) అనే పదం నుంచి వచ్చింది. ప్రాచీన రోమనులు ప్యాపిరస్ రెల్లును ఉపయోగించిరాసేవారు. ఒక రకం గ్రాఫైట్ అంటే కర్బన పుల్లల చుట్టూ దారాలు చుట్టి ప్రప్రథమంగా పెన్సిళ్ళు తయారు చేశారు. గ్రాఫైట్ పెలుసుగా వుండి సులభంగా విరిగి పోవడం వల్ల ఇది అంత ఉపయోగకరంగా లేకపోయింది. అందువల్ల ఉత్తరోత్తరా కర్బనపు పుల్లలను డొల్లగా వున్న కొయ్యలలోపల అమర్చడం ప్రారంభించారు.

మనం ఈనాడు ఉపయోగించే పెన్సిళ్ళను దాదాపు రెండు శతాబ్దాలకు పూర్వం ఎన్.జె. కోంటే కనుగొన్నారు. పెన్సిల్‌ను నాన్ టాక్సిక్ గ్రాఫైట్ నుంచి తయారు చేసినప్పటికీ, దానిని ఇంకా సీసపు కడ్డీలనే అంటున్నారు.



# నవ్వుల పువ్వులు



నర్స్: 'లేవండి.. లేవండి..'
రోగి: 'ఎందుకు, ఏం జరిగింది?'
నర్స్: 'ఏం కాలేదు. డాక్టర్ సూచించిన నిద్రమాత్రలు మీకు ఇవ్వడం మర్చిపోయానంతే.'



ఒకసారి, ఆపరేషన్‌కు ముందు, డాక్టర్ తన చేతిలో పూలదండను పట్టుకుని ఉన్నాడు.
రోగి: డాక్టర్ గారూ మీ చేతిలో పూలదండను పట్టుకున్నారెందుకు?
డాక్టర్: ఆపరేషన్ విజయవంతమైతే దండను నా మెళ్లో వేసుకుంటా. విఫలమైతే నీ మెళ్లో వేస్తానంతే.



ఆడసింహం: కన్నా, ఏం చేస్తున్నావురా?
పిల్ల సింహం: చెట్టు చుట్టూ తిరుగుతున్న మనిషిని తరుముతున్నా.
ఆడసింహం: నీ తిండితో పరాచికాలాడొద్దని ఎన్నిసార్లు చెప్పానే నీకు?



రామ్: 'నా భార్య పెద్దకుటుంబం నుంచి వచ్చింది. మరి నీ భార్య విషయం?'
శ్యామ్: 'లేదు. ఆమె దాన్ని తనతో పాటు వెంటబెట్టుకొచ్చింది.'

# సుడోకు పజిల్

కింది సుడోకు పజిల్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి.
పరిష్కారానికి సూచనలు: ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్‌కు పరిష్కారం జూలై 2011 సంచికలో ప్రచురించబడుతుంది. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కో భాషలో ఒక్కొక్కరికి ₹500/- బహుమతి ఉంటుంది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 9 | | 3 | | | | 5 |
| | 2 | | 9 | | 5 | | | 1 |
| 7 | | | | | | | | |
| | 4 | | | 5 | | | | 2 |
| 2 | | | | | | | | 7 |
| 6 | | | | 1 | | | 4 | |
| | | | | | | | | 3 |
| 1 | | | 3 | | 6 | | 5 | |
| 4 | | | | 8 | | 2 | 6 | |

మీ ఎంట్రీలను 2011 మే 25లోగా పంపించండి. మా చిరునామా:

**SUDOKU PUZZLE,**
**CHANDAMAMA INDIA LTD.,**
Swathi Enclave Nos. 5 & 6,
Amman Koil Street, Vadapalani,
Chennai-600026.
e-mail your entries to:
contests@chandamama.com

*(గమనిక: ఫిబ్రవరి'11 సుడోకు సమాధానాలు మే'11 సంచికలో ప్రచురించబడతాయి.)*

**మీకు తెలుసా?**

## వ్యక్తిత్వం తెలియజేసే దస్తూరీ

ఒకరి దస్తూరీని అంటే చేతిరాతను పరిశీలించి ఆ మనిషి వ్యక్తిత్వాన్ని ఇట్టే తెలుసుకోవచ్చంటే ఆశ్చర్యం కలిగిస్తుందికదూ? దీనినే గ్రాఫోలజీ లేదా చేతిరాత అధ్యయనం అంటారు. ఇది ఒక సైన్స్‌గానే అభివృద్ధి చెందుతున్నదని చెబుతారు. రాసేప్పుడు కలం ఒత్తిడి, కదిలే దిశ, చేతిరాత పరిమాణం మొదలైన అంశాలన్నిటినీ గ్రాఫోలజిస్టులు పరిగణనలోకి తీసుకుంటారు. ఒక వ్యక్తి ప్రవర్తనను అతని చేతి రాత ద్వారా సరిగ్గా చెప్పాలంటే, ఈ శాస్త్రాన్ని క్షుణ్ణంగా, లోతుగా అధ్యయనం చేయాలని చెబుతారు.



గ్రాఫోలజీ ప్రకారం పెద్ద పెద్ద అక్షరాలు రాసేవారు అహంభావులుగానూ, దాపరికం లేకుండా బాహాటంగా స్పందించే స్వభావం కలిగి ఉంటారట. మధ్యస్తంగా అంటే మామూలు సైజు అక్షరాలు రాసేవారు మనోనిగ్రహం కలవారుగా ఉంటారనీ, అస్పష్టంగా చిన్న చిన్న అక్షరాలు రాసేవారు, చాంచల్య చిత్తంతో గుర్తింపు కోసం తపించే వారుగా ఉంటారనీ చెబుతారు. ఈ ఆధార సూత్రాలు కొన్ని కొండ గుర్తులు మాత్రమే అని అంటున్నారు!

# కెరీర్ అంటే?

ఫిజియోథెరపీ విద్యను అందిస్తున్న కొన్ని ప్రముఖ కళాశాలల జాబితాను ఇక్కడ పొందుపరుస్తున్నాము.

1. National Institute of Rehabilitation Training & Research (NIRTAR), PO Olatpur, Cuttack, Orissa 754010. Website: www.nirtar.nic.in
2. National Institute for the Orthopedically Handicapped (NIOH), Bon Hoogly, B T road, Calcutta 700 090.
3. Institute of Physically Handicapped, 4 Vishnu Digamber Marg, New Delhi. Website: www.iphnewdelhi.in
4. College of Physiotherapy, Post Graduate Institute of Medical Research, Chandigarh.
5. Department of Sports Medicine and Physiotherapy, Guru Nanak Dev University, Amritsar, Punjab. Website: www.gndu.ac.in
6. School of Physiotherapy, Orthopedic Centèr, KEM Hospital, Parel, Mumbai 400 012.
7. School of Physiotherapy, SSG Hospital, Vaddodara, 390 001.
8. School of Physiotherapy, paraplegia Hospital, New Civil Hospital, Asarva, Ahmedabad - 16.
9. Physiotherapy School & Center, Govt Medical College 7 Hospital, Nagpur 440 003.
10. Anand Urban Society Trust's College of Physiotherapy , OPP GPO, J. P. Road, Anand,388 001. Gujarat.
11. Sancheti College of Physiotherapy, 16 Shivaji Nagar, Pune 411 005.
12. Ravi Nair College of Physiotherapy, Wardha, 2001-03-08.
13. Shree Swaminarayan College of Physiotherapy, N.H. No 8 &6 Kadodara Char Rasta Taluka Palsana, Surat 394327.
14. SBB College of Physiotherapy, Sheth V.S. General Hospital Campus, Ellisbridge, Ahmedabad 380016.
15. Dr. D.Y.Patil College of Physiotherapy, Dr.D.Y.Patil Medical College Campus Sant Tukaram Nagar, Pimpri, Pune 411018.
16. Sri. Ramchandra Medical College & College of Physiotherapy, Ramachandra Nagar, Porur, Chennai.

- సాయి



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | Did you attend the fuction? | I completely forgot about it. |
|---|---|---|
| Telugu | కార్యక్రమానికి మీరు హాజరయ్యారా? | దాన్ని నేను పూర్తిగా మర్చిపోయాను. |
| Hindi | क्या तुम कार्यक्रम में गए थे?<br>క్యా తుమ్ కార్యక్రమ్ మే గయే థే? | मैं उस बारे में पूरी तरह भूल गया।<br>మెయిన్-అజ్ బారే మే పూరి తరహ్ భోల్ గయా |
| Tamil | நீ அந்த நிகழ்ச்சிக்குச் சென்றாயா?<br>నీ అంధ నిగచ్చికుౣ చెంద్రాయా? | நான் சுத்தமாக மறந்து விட்டேன்.<br>నాన్ శుద్ధమాగ మరందు విట్టేన్. |
| Bengali | আপনি কি সভাতে আসতে পেরেছিলেন?<br>ఆప్ని కి శభాటే ఆస్తే పెరెచిలెన్? | আমি ওই কথাটা সম্পূর্ণ ভাবে ভুলে গিযেছিলাম।<br>అమి ఓయి కథాటా సంపూర్ణభాబే భూలే గియెచ్చిల్లామ్. |
| Marathi | तू कार्यक्रमाला उपस्थित रहाणार आहेस का?<br>తు కార్యక్రమాలా ఉపస్థిత్ రహానార్ ఆహెస్ కా? | मी ते पूर्णपणे विसरुन गेलो.<br>మి టె పుర్నపనే విసరుణ్ గెలో. |
| Kannada | ನೀವು ಕಾರ್ಯಕ್ರಮಕ್ಕೆ ಹಾಜರಾಗಿದ್ದೀರಾ?<br>నీవు కార్యక్రమక్కె హాజరాగిద్దేరా? | ನಾನು ಅದನ್ನು ಪೂರ್ತಿಯಾಗಿ ಮರೆತುಬಿಟ್ಟಿದ್ದೆ.<br>నాను అదన్ను పూర్తియాగి మరెటుబిట్టిద్దె. |
| Oriya | ଆପଣ ଉତ୍ସବରେ ଯୋଗ ଦେଇଥିଲେ କି?<br>అప్ణా ఉత్సబారే జోగా దెయిథిలె కి? | ମୁଁ ଏ ବାବଦରେ ସଂପୂର୍ଣ୍ଣ ଭୁଲି ଯାଇଥିଲି<br>మున్ ఎ బాబడరె సంపూర్ణ భులిజాతిలి. |
| Gujarati | શું તમે કાર્યક્રમમાં ગયા હતા?<br>షున్ తమె కార్యక్రమాన్ గయా హాతా? | હું તેના વિશે તદ્દન ભૂલી ગયો/ગઈ.<br>హున్ తెనా విషె తద్దాన్ భోలే గయో/గయి |
| Assamese | আপুনি অনুষ্ঠানটোলৈ গৈছিল নে?<br>ఆపుని అనుస్థాన్‌టోలోయ్ గోసిలైన్? | মই সম্পূৰ্ণ পাহৰি গ'লো।<br>మోయి గ్సోంపునా పాహ రి గోలు. |
| Malayalam | നിങ്ങൾ ചടങ്ങിന് പോയിരുന്നോ?<br>నింగల్ చదంగిను పోయిరున్న? | ഞാൻ അതിനെക്കുറിച്ച് മറന്നേപോയി.<br>నిజన్ అథినెక్కురిచ్చు మరన్నెపోయి. |
| Santali | [illegible]<br>ఒన్ అఖ్లా తెమ్ సెటెరోగ్ కానా? | [illegible]<br>నోవా ఇది కటే దో పురంజి హింలింజి అకాడ్-ఎ |
| Sanskrit | किम् भवान् कार्यक्रमार्थम् उपस्थित: आसीत् ?<br>కిమ్ భావన్ కార్యక్రమార్థమ్ ఉప అస్థితాహ అస్సీత్? | अहं तु तद्विषये सर्वथा विस्मृतवान् ।<br>అహా మ్ తు తద్విషయే సర్వతా విస్మృతవన్ |





| English | Had everyone else come ? | Yes, everyone else except you. |
|---|---|---|
| Telugu | అందరూ వచ్చారా? | అవును, మీరు తప్ప అందరూ వచ్చారు. |
| Hindi | क्या और सभी आए थे?<br>క్యా ఔర్ షబీ ఆ థే? | हाँ, तुम्हारे अलावा सभी।<br>హాc తుమారే అల్వా శబీ |
| Tamil | மற்றவர்கள் யாவரும் வந்திருந்தார்களா?<br>మట్రవర్గల్ యావరుమ్ వందిరుందార్గలా? | ஆம்! யாவரும், உன்னைத் தவிர.<br>ఆమ్! యావరుమ్ ఉన్నైత్ తవిర. |
| Bengali | বাকী সবাই এসেছিল কি?<br>బాకి సబాయి ఎస్చిల్లా కి? | হ্যাঁ, আপনি ছাড়া সকলেই এসেছিল।<br>హాc, ఆప్ని, ఛాదా సకాలే ఎస్చిలా |
| Marathi | सगळेजण आले होते का?<br>సగలెజన్ అలె హోటె కా? | हो, फक्त तू सोडून सगळे.<br>హో, ఫక్త్ టు సుడన్ సగ్లె |
| Kannada | ಉಳಿದವರು ಎಲ್ಲರೂ ಬಂದಿದ್ದರೇ?<br>ఉలిదవరు ఎల్లరూ బందిద్దారే? | ಹೌದು, ನಿಮ್ಮನ್ನು ಬಿಟ್ಟು ಎಲ್ಲರೂ.<br>హౌదూ, నిమ్మన్ను బిట్టు ఎల్లరూ. |
| Oriya | ଆଉ କିଏ ଆସିଥିଲେ?<br>అను కీ ఆసితిలె? | ହଁ, ଆପଣଙ୍କ ବ୍ୟତୀତ ସମସ୍ତେ<br>హాన్, అపాణంక బైటేటా సమస్తే |
| Gujarati | શું બાકી બધા આવ્યા હતા?<br>షున్ బాకీ బాధా ఆవ్యా హాటా? | હા, તમારા સિવાય બાકી બધા.<br>హా, టమారా శివయా బాకీ బాధా. |
| Assamese | সকলো আহিছিলনে?<br>గ్జకాలో ఆహి సిలైన్? | হয়, আপোনাৰ বাহিৰে সকলো আহিছিল।<br>గ్జోయి, ఆపోనార్ బాహిరే గ్జాగాలో ఆషిల్. |
| Malayalam | മറ്റുള്ളവരെല്ലാം വന്നിരുന്നോ?<br>మట్టుల్లవరెల్లామ్ వన్నిరున్నో? | അതെ, നീയൊഴികെ എല്ലാവരും.<br>ఆథె, నీయొజికె ఎల్లవరుమ్. |
| Santali | ᱚᱠᱚᱭ ᱠᱚ ᱦᱤᱡᱩᱜ ᱨᱮᱱᱟᱜ ᱢᱮᱱᱟᱜ-ᱟ?<br>ఆకోయ్ కో హిజుగ్ రెనాగ్ మెనాగ్- అ? | ᱦᱚᱭ, ᱡᱚᱛᱚᱜᱮ ᱟᱢ ᱪᱷᱟᱰᱟ ᱠᱟᱛᱮ।<br>హోయ్, జోటోగె ఆమ్ చదా కటే. |
| Sanskrit | किम् अन्ये सर्वे आगता: आसन् ?<br>కిమ్ అన్యే సర్వే ఆగతాహ అసన్? | आम्, भवन्तं विना सर्वे एव ।<br>ఆమ్, భవంతమ్ వినా సర్వే ఏవ. |

# మహిళల పర్వదినం



జోధ్‌పూర్‌లో, ప్రతి సంవత్సరం డీంగాగోవర్ పండుగను మహిళలే నిర్వహిస్తారు.

పార్వతీదేవి పుట్టింటి నుంచి మెట్టింటికి వెళుతున్న సందర్భాన్ని పునస్కరించుకుని ఈ పండుగను జరుపుకుంటారు. ఈ పండుగలో పాల్గొన్న వారిని -మహిళలను- దేవత ఆశీర్వది స్తుందని నమ్మకం కూడా ఉంది. మహిళలు చాలావరకు సాంప్రదాయరీతిలో ఈ పండు గను జరుపుకుంటారు.

వీరు జానపద పాటలు, భక్తిపాటలను పాడతారు. పెళ్లయిన స్త్రీ ఈ పండుగ సందర్భంగా పెళ్లికాని మగవారిని కొట్టినట్లయితే వారికి త్వరగా పెళ్లి జరుగుతుందని ఇక్కడివారి విశ్వాసం. అందుకనే పండుగ వేళ మృదువుగా తీర్చిన కర్రలను మహిళలు పట్టుకుని తిరుగుతారు. పెళ్లికాని మగాళ్లకోసం వారు కర్రలు పట్టుకుని తిరుగుతారు. ఇలా బాదించుకున్న తర్వాత మాత్రమే పురుషులు తమకు కాబోయే భార్యను ఎంచుకుంటారు.

# కన్నీళ్లతో రూపొందిన సరస్సు

బరపాణి సరస్సు మేఘాలయలోని ఉత్తర షిల్లాంగ్‌కు 15కి.మీ. దూరంలో ఉన్న ఒక భారీ సరస్సు. దీని పుట్టుక వెనుక ఒక ప్రేమకథ ఉంది. ఇద్దరు అక్కాచెల్లెళ్ళు దివి నుంచి భువికి దిగివచ్చారు. ఈ ప్రాంత సౌందర్యాన్ని చూసి ముగ్ధులై ఇక్కడే ఉండిపోవాలని నిర్ణయిం చుకున్నారు. అయితే వీరిలో ఒక అమ్మాయి మాత్రమే తాను దిగవలసిన చోటికి వచ్చింది. రెండో ఆమె గమ్యం చేరలేకపోయింది. ఈ ప్రాంతానికి చేరుకుని ఏకాకిగా మారిన దేవకన్య నేత్రాలనుండి కారిన కన్నీరే ఈ సుందర సరస్సు పుట్టుకకు కారణమైంది. ఆనాడు సోదరి నుంచి విడిపోయి ఏకాకిగా మారిన చెల్లెలు ఇప్పటికీ విల పిస్తూ కన్నీరు కార్చుతున్నందువల్లే ఈ సరస్సు అన్ని ఋతువులలోనూ నీటితో నిండుగా ఉంటోందని మేఘాలయ ప్రజల నమ్మిక.



# అల్లరి

# బాలుడు




ఒకరోజు, బాలూ తన మిత్రులు చింకూ(తాబేలు), టింకూ(కుందేలు)తో కలిసి సరదాగా నడుస్తున్నాడు.
లోనీ, టోనీ మంచి మిత్రులు. మనం వారికి మిత్రులుగా మారితే మంచిదని అనుకుంటున్నాము. కాని చిరుతలు
బలమైనవి,


బాలూ వెంటనే అడ్డుకున్నాడు...
నేను ఎవరినయినా మిత్రులుగా మార్చుకోగలను. రేపు ఉదయంలోగా నేను వారికి మిత్రుడినవుతాను చూస్తూ ఉండండి.


ఆందోళనగా
కొట్టడం
ఇప్పుడు నేను నా మాట
ఎలా నిలబెట్టుకోవాలి?


ఆహా! నాకో గొప్ప ఆలోచన వచ్చింది.


ఆ మరుసటి దినం బాలూ తన స్నేహితులను పిల్చి వారికి తన పథకం వివరించాడు.
ఇదిగో తెల్ల పెయింట్. అక్కడ ఆ ఆవును చూశారా? దాని తోకను కుంచెగా ఉపయోగించి నా శరీరంపై తెల్ల మచ్చలు వచ్చేలా రంగు అద్దండి.


అద్భుతం!
నేను ఇప్పుడు


తర్వాత బాలూ.. టోనీ, టోనీలు ఉన్న వైపుకు వెళ్లాడు.
హల్లో, నేను-బాలూని,
తెల్లమచ్చల పులిని. మీ మిత్రుడిగా
ఉండాలనుకుంటున్నా!
హాయ్ బాలూ!
సుస్వాగతం.


చిరుతలు
వెంటనే
అతడిని
కలుపుకున్నాయి
బాలూ
రా, పోయి
ఆడుకుందాం!
నా పథకం
ఫలించింది. వీటిని
ఏమార్చగలిగాను.




ఆ మరుక్షణం బాలూ అక్కడి
నుంచి వెనుదిరిగి పారిపోయాడు.
?!
?!


వర్షం వెలిశాక టోనీ,
బాలూను కలవడానికి
వచ్చాడు.
బాలూ, నీ ఒంటిపై మచ్చలను
చూసి నిన్ను ఇష్టపడలేదు. నిన్ను
నిన్నుగా మాత్రమే మేం
ఇష్టపడుతున్నాం.

# పతాకాలు

ఈ నెల మీకు కొన్ని దేశాల పతాకాలను అందిస్తున్నాము.

భారతదేశం



కెనడా



డెన్మార్క్



ఆస్ట్రేలియా



బ్రెజిల్



జపాన్



